జ్ఞానపత్రికా గ్రంథమాల ౧౬.

# వీరవిలాసము.



ఇయ్యది

నాగసముద్ర పురవాస్తవ్యులగు,

## ఎల్లమరాజు వేంకట నారాయణ భట్టుగారి

విరచితము.

---

సాహిత్య సరస్వతి—శ్రీ పి. ఆంజనేయులచే

సంపాదితము.

---

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవర్షంబులు ౧౮౪౩ వ,

దుర్మతినామ సంవత్సర మార్గశిర శుక్ల ప్రథమమున,

మొదటి వేయిపుస్తకములప్రతి.

విజయవాడ యందలి

ఆంధ్ర గ్రంథాలయ ముద్రాయంత్రమున

ముద్రితము.

---



---

అంచెకూలి ప్రత్యేకము] [రూ ౦—౧౨—౦ మూల్యము

# శాలిత్యసంస్కరణసూచిక.

| పుట | పంక్తి. | శాలిత్యము. | సంస్కరణవ |
|---|---|---|---|
| ౧౩ | ౬ | ై। శించె | గై। శించె |
| ౨౪ | ౧౬ | దూలనంబోనిధి| వ్రాలె నేమొ? | విడిచి, యంబోనిధిఁ బడియెనేమొ? |
| ౨౬ | ౧౧ | పతివ్రతవర్తలార! | పతివ్రత వర్తనులార! |
| ౩౦ | ౧౪ | రా—(స్వ) | ఆం—(స్వ) |
| ,, | ౧౯ | బెదరుటకు నేతును | బెదరుటకు నేనును |
| ౩౧ | ౨౩ | జననుల డిగఁద్రోసి | తల్లుల దిగఁద్రోసి |
| ౩౨ | ౫ | మండోదరి— | మందోదరి— |
| ౩౬ | ౩౨ | ఈ చండాలజాతి | ఈ చండాలిని |
| ౩౭ | ౨౪ | బ్రహ్మచెద్దు | బ్రహ్మచెద్దు |
| ౪౦ | ౧౧ | నీసంకటముఁ జూచి | నీకష్టముఁ జూచి |
| ,, | ౨౬ | మాయెడ | నాయెడ |
| ,, | ౩౧ | నాభాగ్య దోషమున | నా యభాగ్యదోషమ |
| ,, | ౩౨ | రాములకిం | శ్రీరామునికిం |
| ౪౬ | ౨౦ | చెట్లు నిర్మూలమగు | మూలనాశనముగాకుఁ చెట్లు నిర్మూలమగ |
| ౫౨ | ౧౫ | కురజములఁజించి | కురజ్ఞములఁజించి |
| ౬౦ | ౨౬ | యానలుఁడిపు | యునలుఁడిప్డు |

# సంపాదకీయ భూమిక.



మా సదుపదేశ గ్రంథమున నీవఱకే శ్రీ యెల్లమరాజు వేంకట నారాయణ భట్టుగారి చిన్నవ్యాసములను రెండింటిని బ్రచురించి యుంటిమి. వారి రచనలయందే వీరవిలాసము "మొదటి" దన వచ్చును. వారీ కృతిని దమ యిరువదియ (౧౯౧౭) వ యేటవ్రాసి, ౧౯౧౮ వ సం॥రము జనవరి మాసాంతమునఁ, బ్రచురణార్థమై గ్రంథాలయమున కనిచిరి. అనతికాలముననే మా యాంధ్ర సోదరులకు సమర్పింప నిశ్చయింపఁబడిన యీకృతి, యనివార్య కారణములచే నేఁటిదనుక నంతర్ధాన మందియుండవలసి వచ్చెను. మే మెంత శీఘ్రముగ దీనిఁ బ్రచురింపఁ దలఁచితిమో యంతయాలస్యమే యైనది. మావలన నింతవఱకుఁ దమకుఁ గల్గిన యాశాభంగమునకై గ్రంథకర్తగారు మము క్షమింపఁ బ్రార్థితులు.

మా యాప్తవర్గమునకుఁ జేరిన శ్రీ ఉమర్ అలీషాకవిగారు, గ్రంథరచనాదికములఁ గూర్చి విమర్శించుటకు సంపూర్ణాధికారము వహించి యుండుటచే మే మాపొంతఁ బోవమానితిమి. మా యందలి యెడ నే ప్రొద్దు నొకేవిధమగు వాత్సల్యమునే కనఁబఱచుచు, మా ప్రార్థనల నంగీకరించి వాని నోపికమెయిఁ దీర్చుచుండు, మా ధర్మభ్రాతలగు శ్రీ యలీషా కవిగారికిని, సర్వ స్వాతంత్ర్యములతో నుదారభావమున నీకృతిని మా నిలయమున కొసఁగిన మాయనుంగు సోదరులగు గ్రంథకర్త గారికిని, మే మెంతయును గృతజ్ఞులము.

ధర్మవరము,
దుర్మతి సం॥ర కార్తిక కృ ౧౫,

సంపాదకుఁడు,
శ్రీభగవానుని పుష్పహార కుటీరము.

# పీఠిక.

ఉ॥ చారుకళా ప్రపూర్ణము, ప్రశస్త కవిత్వ పటుత్వతోష్య శృం
గారము, రామతారక జగత్పరిపూరిత పుణ్య వాగలం
కారము నైదనర్పునిది, కాంచన మంజుల పాత్రలీల నీ
'వీరవిలాస' రూపకము, ప్రేమమెయిన్ బఠియింత్రు సజ్జనుల్. ౧

కం॥ కథ రామచంద్రచరితము,
సుధా మధురరసము లాలుకు సూక్తులు, విద్యా
నిధులగుఁ గవులకు నిది పె
న్నిధి, మైథిలిఁ గూర్చి పాడ నేర్చిన దగుటన్. ౨

ఉ॥ ఏయెడవిన్న మిన్నయగు నెల్లమరాజ కులంబునందు నా
రాయణభట్టు, వాఙ్మయ ధురంధరు సీరిపి యాంజనేయ ని
త్యాయత మిత్రసత్తముఁ, డనంత గుణార్ణవుఁ డీప్రబంధమున్
జేయఁగ, నింక లోటొదవఁ జేయునె యెన్ని తెలుంగు లారయన్. ౩

కం॥ తప్పులు లేవు; గుణంబులు
కుప్పలు తిప్పలుగఁ గలవు; కూర్మిని గసమున్
జిప్పిలు చున్నది; కవనం
బిప్పగిదిని నుండవలయు నెవ్వరికైనన్. ౪

తే॥ గీ॥ భక్తి నెదలోన నిడికొని వ్రాయునట్టి
కవిత, లతవలె శోభను గాంచఁగలదు;
అందు రామచరిత్ర వ్రాయంగ నేర్చు
కవిదె జన్మమా కావ్యంబె కావ్యమగును. ౫

కం॥ ఔచిత్యము చెడదెక్కడ,
ప్రాచీన కథావిధాన ప్రాచుర్యము నెం
తే చక్కనగుచు నున్నది;
వాచాలత యిట్టులుండ వలయున్ గవికిన్. ౬

కం॥ రూపకము లెన్నొ తెనుఁగున
వ్యాపకమున నున్నవిపుడు, వానికిఁ గుణవి
వ్యాపటిమఁ గలుగునెవియో,
యాపని లోకంబు సేయు నగును గ్రమమునన్. ౭

తే॥ గీ॥ పూర్వనాటకఫక్కిని బోనడంచి,
యాంగ్ల పారసి పద్ధతి యందు రంగ
నిర్ణయంబును సేయుచు దిద్దివృత్తి
నేఁటి నాటకజనమల వాటుపడదొ. ౮

తే॥ గీ॥ లోకము ప్రమాణమని, గుణ ♦ లుబ్ధులైన
తార్కికులు సెప్పువాక్యసం ♦ తతుల నమ్మి,
కథను నౌచిత్య భంగంబు ♦ గలుగకుండఁ
గవి రచించెను నీనాట ♦ కంబు మనకు. ౯

తే॥ గీ॥ నాటకములన, దేశాన ♦ నాటియున్న
బానిసత్వ మహాతరు ♦ ప్రకరమూల
ములు పెకల్చెడు గడ్డపా ♦ ఱలు సుమండీ!
వీనిచేఁ బ్రజ, సాంఘిక ♦ జ్ఞానపథముఁ
ద్రొక్కి, సార్థకజన్ములౌ ♦ దురు ధరిత్రి. ౧౦

తే॥ గీ॥ పూర్వ పశ్చిమ దేశముల్ ♦ పూజ్యనాట
క ప్రదర్శన చారుభా ♦ గ్యంబువలనఁ
దేజమును బెంపు వహియించి ♦ తేజరిల్లు;
లేనిచో- నంధకారంబు ♦ లోనఁ గలిసి,
నక్కలఱచెడు తావులై ♦ ప్రుక్కుకున్నె? ౧౧

సీ॥ పాశ్చాత్యదేశాల ♦ వలెమనదేశంబు స్వాతంత్ర్యతేజంబుఁ ♦ బడయువఱకు
మనభాషలోపల ♦ మనకు విజ్ఞానంబు కడుఁబుగాన్కి బడులలోఁ ♦ గఱపువఱకు
మనజాతి-మనమత ♦ మును-మనపరిపాల నాయత్తమైసొంపు ♦ నందువఱకు
మన స్వయంనిర్ణయ ♦ మును మనచేతిలోఁ గరతలామలకమై ♦ క్రాలువఱకు
నాటకంబులో- కథలో- యే ♦ పాటలొక్కొ
చేసి, దేశంబు మేల్కొనఁ ♦ జేయవలయు,
కవికి భాగంబు నితరుల ♦ కన్న నధిక
మున్న దనుమాట మఱవరా ♦ దెన్నఁడేని. ౧౨

తే॥ గీ॥ ఘన వసంతాగమంబున ♦ వనమునందు,
కోకిలమువచ్చి స్వాగత ♦ కూజితంబు
సేయుకైవడి, తనదేశ ♦ సేవకొఱకు
కవి లిఖింపఁగవలె నాట ♦ కములు పెక్కు. ౧౩

తే॥ గీ॥ రాముఁ డేనాఁటివాఁడో సు ♦ త్రాముఁ డెవఁడో
పరులెఱుంగరు కాల సం ♦ కరమువలన;
కవియెఱుంగును గాన నే ♦ కాలమందు
వాని కావ్యంబె మార్గ సం ♦ ధానమగును. ౧౪

తే॥ గీ॥ ప్రజలు గలచోటఁ గవులను ♦ బ్రకృతిసేయఁ
జాలు, కవులచేఁ బ్రజలకుఁ ♦ జాలమేలు
గలుగవలె, గంగచే శాంతి ♦ గలుగునట్లు;
అట్లు గానిచోఁ, గవికన్న ♦ నధముఁ డెవఁడు? ౧౫

ఉ॥ రాజులు వారిరాజ్యము వ♦రాలును రాజును, సౌధవీథులున్
బూజులుపట్టిపోవును, ప్ర♦పుణ్య కవిత్వ మహత్వ సంపదన్
దేజమువచ్చు నన్నిఁటికి, ♦ దివ్యధనంబు జనాళి కీశ్వరుం
డోజ నొసంగెనో యనిన ♦ నొక్క కవిత్వమెసుమ్ము ధారుణిన్. ౧౬

తే॥ గీ॥ అట్టి పూతచరిత్రమై ♦ నట్టి కవిత,
యబ్బినప్పుడు దుర్వినియోగ ♦ మందకుండ,
సత్ప్రబంధంబులను వ్రాసి ♦ చన్నవాఁడె
కవియు మహనీయమూర్తి ని♦క్కముపలంప. ౧౭

ఆ॥ వె॥ కవిత యొకరిసొమ్ము ♦ గా దెవ్వఁ డొక్కొక్క
వ్యక్తి కొక్క భాగ్య ♦ మబ్బుచుండు,
దాని శిథిలమైన ♦ దానినిగా సేయ
కుందసేయఁ గోవి ♦ దుండు తెలిసి. ౧౮

కం॥ శ్రీరామచరిత్ర 'మహా
వీర చరిత్ర' యనిపేరు ♦ పెట్టిన పూర్వా
చారముఁ దప్పక, దీనికి
'వీర విలాసంబు' పేరు ♦ పెట్టుట దగదే.

కం॥ లంకాదహన కథార్థ ము
లంకారము చెడని విధము ♦ లం జేసిన, మా
వేంకటనారాయణ భ
ట్టాంకున కీశ్వరుఁ డభీష్ట ♦ మందఁగ సేయున్. ౨౦

తే॥ గీ॥ కవితఁగూర్చి ప్రసంగంబు ♦ కట్టిపెట్టి
దోషములఁగూర్చి చర్చించు ♦ త్రోవమాని
సీరిపాంజనేయ సుధీంద్రు ♦ చిత్తవృత్తి
నిఙ్ బోదలు మాధుకీసుధా♦నిధిఁ దలంగి
సతము మెస్తు, సాహిత్య భా♦రతి యటంచు. ౨౧

పిఠాపురము; ౨౭-౧౧-౧౯౨౧.

ఇట్లు,
ఉమర్ అలీ షా.

# వి జ్ఞ ప్తి.

కం॥ వనితయుఁ గవితయుఁ దా నై
సను దెంచుట గలుగునేని ♦ సరసంబగు, ధా
త్రినిఁ బల్మికోలు గావిం
చిన విరసంబగు నటంచుఁ ♦ జెప్పిరి విబుధుల్ ॥

కావునఁ గొండికనాఁ డక్షరాభ్యాసముఁ జేయునప్పుడును, నిజేచ్ఛంజని బాలురతోఁ గలిసి యాడునపుడును, జిలిబిలిపలుకు లేవియో కొన్ని పలుకుచుండెడి వాఁడనని, నా పెద్ద లిప్పటికి ననుకొనుచున్నవారు. నేను జన్మించిన దొకపల్లె. ఇట్టిచోఁ బుట్టి పెరుఁగుచు బాల్య చాపల్యమున నాటలకై పరువిడు నన్నడ్డుపెట్టి, విజ్ఞాన కుశలియు, హరికథాశ్రవణ కౌతూహల పరాయత్త చిత్తయు, 'నారమ' యను పేర బొలిఁగాంచిన మాయవ్వ ననుఁ దన యొడిలోఁ గూర్చుండఁబెట్టికొని, నాచే శ్రీమద్భాగవతమును జదివించు చుండెడిది. నేనును దెలిసి తెలియని యర్థమునకుఁ దలయూఁచుచు, శ్రీకృష్ణుని కల్యాణగుణములు మాయవ్వచే విని యానందించు చుండెడివాఁడను. ఇట్లు నిరంతర పరిశ్రమవలన భాగవతమును ధారాళముగఁ జదువ నేర్చితిని. మాయవ్వయు నన్నత్యంతానురాగముతోఁ బెంచుచు, నప్పుడప్పుడు తనకుఁ దోఁచిన యర్థమును జెవినివేయుచు, నాబుద్ధి ననారతము పఠన గ్రహణాదులయందే వినియోగింపఁ జేయుచుండెను. ఆమె చదువురానిదైనను, బహుపురాణకథాశ్రవణము వలన మంచి విజ్ఞానమును గడించి యుండెను. నాచిన్నతనమునుండి గ్రంథరసాస్వాద నాపరత్వమున కామె యేకారణము. అమ్మహనీయురాలి పరిపూర్ణ కటాక్షము వలననే నేనిపు డాంధ్ర మహాశయుల కృపావలోకనము నించుక వడయఁగల్గితిని. అట్లు కొంత కాలము గడచినపిమ్మట శ్రీ శృంగార నాటకసమాజమువారిలో సోదరసమేతముగఁ జేరుట తటస్థించెను. అచ్చట విద్యాభ్యాసమొనర్ప వీలులేకపోయెను. బాల్యమున నావిద్యాభివృద్ధికయ్యది భంగకరమయ్యెనని యిప్పుడు స్మరణకు వచ్చుచున్నది. ప్రతిక్షణప్రాదుర్భూత మగు విద్యాగ్రహణాభిలాష నాపలేక, విజ్ఞుల చరణము లాశ్రయించి విద్యగడింతమని యెంతప్రయత్నించినను నిష్ఫలమగుచువచ్చెను. ఋష్యాశ్రమ సమాశ్రయమగు శుకము వేదమంత్రముల నుచ్చరించుటయుఁ, గటికివానియింటఁ జెరిఁగిన

చిలుక కఠోరము లాడుటయు సంసర్గము వలననే; కాన బాలురకు సంసర్గము మంచి దిగ నుండవలయును. నాకట్టి సంసర్గము లభింపలేదు. నాభాషావివృద్ధి ప్రయత్నమును గొనసాగలేదు. ఇట్లున్నను గవుల మాహాత్మ్యమును విన్నపుడును, వారిచరిత్రను లాలకించి నపుడును, దేహము హర్షపులకిత మగుచుండెడిది; కావునఁ గొంతకాలమైనను గురుముఖమున శాస్త్రార్థముల నెఱింగియుంటినేని, కించిత్ప్రజ్ఞను గడించి యుండు నేమోయని నేఁటికిని శంకించుచునే యున్నాఁడను.

శ్రీ శృంగార నాటకసమాజమువారు నాకవిత లప్పుడప్పుడు వినియున్న వారగుటచేత, సుందరకాండయందలి లంకాదహనఘట్టమును ప్రదర్శనానుకూలముగ నాటకము వ్రాసియిమ్మని యడుగ, లోకమున నిప్పుడ నేకులు మహానుభావులు రూపకములవ్రాసి భాషకు మహోపకార మొనర్చుచుండఁగా, నేను రచనమునకుఁ బూని భాషాయోషామణికిఁ గురూపమును గల్గించి, మహాపకార మొనర్చిన వాఁడనగుదు నేమోయని, యేతత్ప్రయత్న విముఖుఁడనగు నన్నుఁ దద్దయుఁ బ్రోత్సహించుటయు, నెట్టకేలకు నేనందులకు సమ్మతించి, చరిత్రాంశము ననుసరించి నాయోపినకొలందిని వ్రాసితిని. సోదరభావమున నన్నుఁ జేరదీసి, యేతద్దృశ్య ప్రబంధము నామూలాగ్రముగఁ జదివి, సంశయవిషయముల నాకుం దోడ్పడి, ముద్రణాదికార్యభాగములఁ దమపైని వేసికొని, పరిశ్రమించిన, విజ్ఞానవల్లికా గ్రంథమాలాధిపతులును శ్రీ సాహిత్య సరస్వతీ బిరుదాంకితులును నగు, శ్రీయుత సీరిపి యాంజనేయుల వారికి భగవంతుఁ డన్నియెడలఁ దోడ్పడుఁ గాకయని కోరుచుఁ బ్రేమపూర్వక ప్రణామము లర్పించుచున్నాఁడను. వెండియుఁ బండితప్రవరు లిందలి దోషములను దెలుపుదురేని, యాజన్మాంతముఁ గృతజ్ఞుఁడనై యుండెదనని విన్నవించు కొనుచున్నాఁడను.

మకాము:<br>ధర్మవరము.

ఇట్లు విద్వజ్జన చరణసేవకుఁడు,

ఎ. వెం. భట్లు.



“ఓమ్”

# వీరవిలాసము.

## నాంది.

ఉ॥ శారద యామినీ విమల ♦ చంద్రికలం దనివోందఁజేసి గ్రీ
ష్మోరు రవిప్రతాపహతి ♦ నోజనలంచి సుఖంబు దుఃఖముల్
ధారుణినాత్మ కిమ్మెయి య ♦ థార్థవిధమ్మునఁ జాటి రెండిఁటిన్
దారి చరించి యుంటని యు♦దారుఁడు మీకుఁ బ్రసన్నుఁ డయ్యెడున్.

(నాంద్యంతమున మందహాసాలంకృతుఁడగు శారద్వతుఁడు ప్రవేశించి)

శార — మూర్తీభవించిన సారస్వతులో యనఁదగు నీ పత్రికలు మాకుఁ బూజ్యాలు.

(పుష్పాంజలి వెదజల్లును.)

(విశారదుఁ డనాహూతుఁడై ప్రవేశించి) బావా! వసంతోత్సవము నాఁటిరాత్రి మహాకవి కాళిదాసకృతమగు శాకుంతలమును బ్రదర్శించిన యనంతరము నేఁపటి దినమున నగు ప్రదర్శన మఖిలజనామోద సంధాయక మంటివి; దాని కథ యెద్దియు సూచింప వైతివి.

శార — సుందరకాండాంతర్గతమగు ‘వీరవిలాస’ మని చెప్పితినే?

విశా — ఆహాహా! భాగ్యము.

కం॥ ప్రాత స్సంధ్యల నెడపక
యేతని శుభచరితములఁ బ ♦ ఠింతురు బుధులా
ద్యాతప్పు గుణ శ్రవణము
పూతచరిత్రుల నొసఁగుఁ ♦ బుణ్యప్రదమ్మై.

"రామరాజ్య" మని నేటికిని విఖ్యాతి నందియున్న యమ్మహానీయుని పవిత్ర చరిత్ర మఖిల జనామోద సంధాయక మగుఁగాక. విశారదా! కథా యోగ మట్లుండనిమ్ము. ఏతద్దృశ్యప్రబంధ రచనము బహు విజ్ఞాన కుశలంబగు నీ సభాజన రంజనమునకుఁ దగియుండునా?

శా — ఈ మహాజనులు రంగమంటప మలంకరించిన తోడనే విన్నవింపవచ్చిన యంశమును మఱచి కర్తవ్యకార్యమునం దేమఱుపాటుఁ జూపినందుల కిప్పుడు శంకించుచున్నాను.

వి — విజ్ఞులెప్పుడును ప్రమాదముపలని లోపములను సరకుగొనరు. ఇప్పుడైనను సంశయము వలదు.

శా — అట్లయిన మనవియొనర్చెదఁ గాక (సావలోకనముగ) సహృదయులారా! సదస్యులారా! ఈనాటకము నవ్యకల్పలాపములతో రచింపనున్న యావిధేయుఁడు ప్రణామపురస్సరముగ మీతో నిట్లు మనవి సేయుమని నన్నుఁ బ్రేరేపించుచున్నాఁడు. ఏమన?

తే॥ గీ॥ ఏనరుని కాంక్షితంబుఁ దా ♦ నెద్ది తాల్చు
నందలి గుణాగుణంబుఁ దా ♦ నరయకుండ
పూనియొనరించు నందాకఁ ♦ బొందు నెట్లు
శమన? మిది నిసర్గము సూవె ♦ జనులయందు.

కావునఁ జిరకాలకల్పితమగు తన యాశావృక్షమును బుష్పింపఁజేయఁదలంపుఁ గొన్నవాఁడయి, యియ్యది రసవిహీనంబయ్యెనను మనోహర మాలతీవనవస్త్యమునఁ బూతిగంధహేయమగు ప్రకీర్యజము వెలువడుటగాఁ దలంపు గొను చున్నాఁడు. మఱియు మాదృశుల కల్పనావైరస్యమ్మునఁగాదె! ప్రజ్ఞాసంపన్నుల కవనంబు సరసతం బొంది, వాసియు వన్నెయుఁ గాంచుట? అయినను,

తే॥ గీ॥ భవ్య రామకథా విని ♦ బద్ధ మగుట
జగతి మత్కవితకును బ్ర ♦ శస్తికలదు,
విరులఁ బూన్చిన నారయు ♦ శిరమునందు
సరసమతులచేఁ దాల్పనో ♦ కరణిఁ గాఁగ.

వి — శారద్వతా! వినయగర్భిత మగు నీవిన్నపమునకైన నీసభికులు మన్నింపక పోరు. ఇఁకఁ గార్యాంతర ప్రయత్నమునకు మఱలుదము రమ్ము!

శా — అట్లే చేయుదము.

ఇది ప్రస్తావన.

---



"ఓమ్"

# వీరవిలాసము.

## ప్రథమాఙ్కము.

(ప్రథమ రంగము—మాల్యవంతాద్రియందలి వృక్షచ్ఛాయనుండి రాముఁడు ప్రవేశించుట.)

లోపలధ్వని.

తే॥ గీ॥ అన్న మాయామృగము వెంట ♦ జన్ననాఁడు
సీత లోకైక మాత కా ♦ క్షించునాఁడు
నీవు మాకడ్డుపడరాదో? ♦ కావరంబొ?
హరిణమా! నేఁటి దుఃఖ మిం ♦ ట్లగునె చెపుమ?

రాము—(వినుట నభినయించి తలపంకించుచుఁ దనలో) అయ్యో! సౌమిత్రి చిత్తభ్రమచేత నిప్పుడు కాలము నెఱుఁగఁజాలకున్నాఁడు. (ప్రకాశముగ) ఓదయామయా! సూర్యుండదే యభోమధ్యమండల మలంకరింపఁబోవుచున్నాఁడు చూడు. ఇదిగాక,

తే॥ గీ॥ శబరయోషా పుళింద త ♦ స్కర కిరాత
వరులు భూరుహచ్ఛాయల ♦ వఱలువారు
అకట! లక్ష్మణా! దప్పుల ♦ కరుగవలదు
చండకరుఁ డించుకయు దయా ♦ సరణిఁగనఁడు.

లక్ష్మణా! రమ్ము. నేఁటికి నిరాహారులమయి యుండుదము. నీవొంటరిపాటున నుండఁదగదు. అప్పుడు నీదుఃఖ మతిశయించును. మనమున్నగతియేమి? సీత లభించుటేమి! (స్వ) ఏమి! సీతయను నక్షరద్వయము స్మరణమాత్రమ్మున హృదయవిదారణమగుచున్నది. ఓ నిష్ఠురహృదయునీ!

తే॥ గీ॥ అనుజశోకభరమ్మున ♦ కాత్మఁ బగచి
సాహచర్యాదికమున భూ ♦ జములుఁ గూడఁ
బండుటాకులు రాల్చె నె ♦ పమ్ముచేత
బాష్పకణములు విడిచెడు ♦ భంగిఁ దోఁచె.

అచేతనములు సైతము తమ కృతజ్ఞత నగపఱచుచున్నవి. నీయెడ సత్ప్రక్రియయు గన్పడదేమి? ప్రాణాధికప్రియవగు నీవియోగమున జగమంతయు శూన్యమై కన్పట్టుచున్నది. మఱియు,

సీ॥ నీమూలమునఁగదా? ♦ నిరతంబు లక్ష్మణుం
డతిశయవేదన ♦ లందువాఁడు
నీమూలమునఁగదా? ♦ నిఖిలాటవుల నెల్లఁ
జరియింతు మిట్లు వి ♦ షాదవృత్తి
నీమూలమునఁగదా? ♦ నిఖిలంబు నెడఁబాసి
వనచరావళితోడ ♦ మనఁగవలసె
నీమూలమునఁగదా? ♦ నృపలోకమున సక
లంకుఁడైతిని భవ్య ♦ లలితగాత్రి॥

తే॥ గీ॥ సకియ! నీకతమున సహ ♦ జన్ముఁడకట!
నిందఁదాలిచి తనయంతఁ ♦ గుందువాఁడు
సర్వవిధముల మము దుఃఖ ♦ జలధిఁ ద్రోసి
పోయితే! నీదుదారినిఁ ♦ దోయజాక్షి!

మనోహారిణీ! సీతా! సౌమిత్రి నెడఁబాసి యొకక్షణమైన నుండఁజాలని నీవు కఠోరహృదయవై యెట్లు కడపుచుంటివి? ప్రాణము లలరింపోకార్చి మమ్ము గతికులఁ జేయవుకదా? అకటా! వలసినట్లు వైభవముల ననుభవించుచు సుఖముగ నయోధ్యయందు నీబంధువర్గములోఁ గూడి యుండక మా వెనువెంట నీయరణ్యమునకు రానేల?

తే॥ గీ॥ మహితులగు నత్తమామల ♦ మాటలెల్లఁ
ద్రోసి ననునమ్మి కానలఁ ♦ గాసిఁబడుచుఁ
జెంతనడయాడు నిన్ను ర ♦ క్షింపలేక
చంచలాక్షిగొ! కాన క ♦ ర్పించుకొంటి!

ప్రాణేశ్వరీ! సమగ్రవైభవ విభాసితుఁడగు జనకరాజర్షికిఁ గూర్మితనయ వయ్యు నీవెట్టియిడుమ లందవలసివచ్చెను? జననియగు కైక కామితంబీడేర్చిన పిమ్మట, ధర్మపత్నితోడను దమ్మునితోడను సుఖముగ మఱల నయోధ్య చేరుదునని తలంచితి; కాని నిన్నీవనభూముల కప్పగింపవలసివచ్చు కొఱంగ నైతి. నే నయోధ్యకుఁబోయినంతనే తమగారాపుకోడలిం గానక పరితపించు కౌసల్యాది యంతఃపురజనముల నెట్లూరార్తును? భరతాదిసోదరుల కేమని ప్రతివచనంబిత్తును? (ఆలోచించి) వీని నన్నింటి నెట్లో భరింపనగుఁ గాని,

తే॥ గీ॥ ఏ నయోధ్యఁ జేరినయంత ♦ నెనయుఁ గూర్మి
తనయఁ గనఁ గోరవచ్చిన ♦ జనకుతోడ
నేమని వచించువాఁడ నిం ♦ కేది తెరవు?
లలిత సీతవృత్తాంతంబు ♦ లజ్జ లేక!

కావున నిన్నువిడిచి జీవింపఁజాల. మఱియు సకలమహీపతుల సమక్షమున నాయఖండదోర్వీర్యంబు నెఱపి శివుకోదండము ఖండించి,

మ॥ నినుఁ బాణిగ్రహణంబు సేయునెడ వి ♦ న్వీధిన్ సురల్ సాక్షిగా
మనినన్ దాఁకఁ గొఱంతలేక మహి సం ♦ రక్షింతు నేనంచు మ
న్ననయంబొప్పఁగఁ బల్కి బొంకిన నికృ ♦ ష్టాత్ముండఁ గష్టుండ నో
వనితా! ఘోరవిపద్దశన్ గలఁగు ని ♦ న్బాలింపలేకుంట చేన్!

(స్మృతినభినయించి) నే నిట్లు దుఃఖపరీతచేతస్కుఁడనై యుండఁగాఁ జూచిన నాతమ్మునిశోక మతిశయించును. అపుడు మ మ్మిటనూరార్చు వారెవ్వరు ?

(ధనుర్ధారియై లక్ష్మణుఁడు ప్రవేశించును.)

రా.—(చేరఁబోయి ఆలింగన మొనర్చుకొని) సౌమిత్రీ! దినకరాతపతైక్ష్ణ్యంబున వదనబింబము కళావిహీనమైనది. కుటీరప్రాంతమున కేగుదము రమ్ము.

(నిష్క్రమింతురు — యవనిక)

---

## ద్వితీయరంగము—పర్ణశాల.

ల—అన్నా! ప్రబలప్రయత్న మొనర్చియు నింతవఱకు సీతామహాదేవి నెఱుంగ మైతిమి. సైన్యపురస్సరముగఁ దోడ్పడవచ్చెదనని పల్కిన సుగ్రీవుఁడుకూడ నేఁటివఱకు వచ్చెడు జాడ గానము.

రా—సౌమిత్రీ! పరులెన్నఁడో తమ కుపకారులగుదురని నమ్మి, స్వకార్యనిర్వహణము నకుం బూనుకొనువాఁ డెంత యవివేకి! ఇటు వినుము.

తే॥ గీ॥ స్వసుఖ సాధనమునకునై ♦ జనములెల్ల
వినయ భయభక్తు లెదఁదోఁప ♦ వెంటనుంద్రు
కార్యగతి దీఱెనేనియుఁ ♦ గానఁబడరు
పరహితమునకు నింకేల ♦ పలుకవలయు?

స్వకార్యము ముగిసిన పిదపఁ బిలిచినను బలుకువా రుండరు. ఇట్టి కృతఘ్నులతోడి మాటలేలయని యూరకుండుదమన్న సీతాన్వేషణమునకుఁ గొలఁది పరిజనమైనఁ గావలయుఁగదా?

ల—వర్షర్తువు గడచినవెంటనే సకలసైన్యముఁ గూర్చుకొని వచ్చెదనని కదా యా సుగ్రీవుఁడు పలుకుట?

రా—స్వకార్యనిర్వహణార్థ మప్పటి కట్లుపల్కి యుండవచ్చునుగాని నేఁ డామాటలు జ్ఞాపకమున నుండెనఁగదా!

ల—(స్వ) అకటా! పయికిఁ గృపామృతచేతస్కులట్లును, విశ్వాసపాత్రులచందము నను మాటలాడుచు ఘాతుకహృదయులుగల మహానీయు లెందఱో కలరు కదా! ఇదియుఁగాక సుగ్రీవుఁ డిప్పుడు రాజ్యవైభవోపేతుఁడగుటచే నొరుల సరకుగొనకున్నవాఁడు. ఆహా! విచిత్రము.

తే॥ గీ॥ పేదయగునాఁడు పలువుర ♦ పాదములను
బట్టి భయభక్తులను గనఁ ♦ బఱచునతఁడె
పసిఁడి గల్గిననాఁ డెంత ♦ ప్రాజ్ఞుఁడైన
సరకుఁగొనక ప్రచండుఁడై ♦ సంచరించు.

ల—అయిన నతఁడట్లు నిరాకరించినను, గార్యసాధనోపాయములో [illegible] మనమైనఁ దలపింపవలసినదికదా?

రా—కావున, నీకిప్పు డాతనికడ కేగుము. సర్వపరిజనసమేతముగ నా మాటలుగా నిట్లు చెప్పుము.

సీ॥ చక్రవర్తి పదంబు ♦ సరవిదాల్చి వెలుంగు
సుగ్రీవునకుఁ జాల ♦ సుఖమె యనుము
గిరికందరముల దాఁ ♦ గిననాఁడు చేసిన
యాఱడింపుల మది ♦ నుంచుమనుము
గర్వశత్రువును బోఁ ♦ కార్చి యొనర్చిన
మహాదుపకారంబు ♦ మఱవకనుము
మేలిమిఁ గిష్కింధ ♦ నేలఁ జేసిననాఁడు
తానొనర్చిన బాసఁ ♦ దలఁపుమనుము

తే॥ గీ॥ కడకు నిర్నియుమఱచి సౌ ♦ ఖ్యంబులంద
మఱఁగియుండుట కార్యంబు ♦ తెఱఁగె ? యనుము
తనదుపలుకులు నిలుపంగఁ ♦ దలఁచెనేని
సాయమొనరింప నిది మంచి ♦ సమయమనుము!

కిష్కింధారాజ్యమునకుఁ బట్టభద్రునిగాఁ జేసిననాఁటి మహోపకారంబులఁ జింతించి యతఁడొకవేళ మనయెడఁ గృతజ్ఞుఁడౌనని

కం॥ రమ్మనుమా! సేనల నిటుఁ
దెమ్మనుమా! భూమిజా సతీమణి నరయన్
బొమ్మనుమా! తన కిదె భా
రమ్మనుమా! దీన జగము ♦ రంజిలు ననుమా!

ఎంతటి విశ్వాసపాత్రులనేని పరనీయులవిశ్వసించు ప్రమత్తత వహించుటపాడి గాదు; కావున సుగ్రీవాదులసహాయమున ధనువు నేమఱియుండక అద్దయు నారమనంబుల నొప్పనాఁడక, నిరుపాయంబుగాఁ గార్యంబు నిర్వహించుకొని రమ్ము; పొమ్ము.

ల — చిత్రము.

(యవనిక)

తృతీయరంగము:—కిష్కింధలోని యంతిపురపు మేడ.

---

సుగ్రీవ తారలు శయ్యపై నుందురు.

(లోపల ధ్వని వైతాళికుఁడు.)

తే॥ గీ॥ భూతలాధీశ్వరులు జగ ♦ త్పూజ్యు లైన
సంయమీంద్రులు భృత్యులు ♦ సైన్యపతులు
వేచియున్నారు మిముఁజేరి ♦ విన్నవింపఁ
గృపను నీయెడ సాక్షాత్క ♦ రింపఁ గదవె!

(సశ్రుతముగ సుగ్రీవుఁడు తల యూఁచుచు) దేవీ! మలయానిల సౌరభము తోడ శ్రవణ సుఖంబుగఁ దోఁతెంచుచున్న యీ నినదం బాలించితే? వయోవృద్ధులు, తపోవృద్ధులు, జ్ఞానవృద్ధులు ధనవృద్ధ నివాకిట నుండు రనుమాట వాస్తవము. వెండియు,

తే॥ గీ॥ అతిశయామోద కాంతా వి ♦ హార భూమి
గౌరవ సువృక్షమునకు మూ ♦ ఖ్యంపుఁ బ్రోది
జన వశీకరణమునకు ♦ నెనయు మందు
ధరణి ధనమున కెందు దు ♦ ష్కరము గలదె?

కావున సర్వవిధముల భాగ్యవంతున కసాధ్యము లేదు.

తార—సార్వభౌమా! నిరాశ్రయులై ప్రాణభీతిచే గుహాబిలంబుల నడఁగి యున్న మీరు నిర్భయంబుగ రణావని వాలి నెదిర్చి పోరఁగలుగుట కే మహాత్ముని కారుణ్యము వజ్రకవచ మయ్యెనో? ఏదయామయుని కతమున శత్రు హస్తంగత మగు రాజ్యలక్ష్మి యైంద్రజాలికుని చేతంబలె స్వవశ మయ్యెనో? అట్టి మహోపకారియు మీయెడఁ బక్షపాతియు నగు రఘురాముని మనసున నైనఁ దలఁపవలదా?

సుగ్రీ—సత్యము, సత్యము. సంసరణ విప దంబుధి తరణ కారణ మగు రాముని కరుణయ కాదే మమ్మింతకుఁ దెచ్చుట? ఆమహానుభావుఁడు మన కొనర్చిన యుపకృతు లన్నేనియుఁ గలవు.

సీ॥ కొండబిలంబుల ♦ నుండుచోఁ దరిఁజేర్చి
ప్రబలతరోత్సాహ ♦ పటిమఁ దెచ్చి

రణ మొనర్పఁగఁ జాల ♦ కణఁగియుండెడు వేళ
సమర సన్నాహంబుఁ ♦ జాటిచెప్పి
ఘన శత్రుసైన్యవా ♦ హిని తరంగములకుఁ
జెలియలికట్టయై ♦ నిలువనేర్చెఁ
బ్రణుతదోర్బలుని వా ♦ లినిఁ బోరఁ బరిమార్చి
హృదయ శల్యమువాపి ♦ ముదముఁగూర్చె
తే॥ గీ॥ అన్నచే భూతిఁగోల్పోయి ♦ యున్ననన్ను
భవ్య రాజ్యంబునకుఁ బట్ట ♦ భద్రుఁ జేసె
నట్టి రామావనీశ మ ♦ హామహుండు
కరుణ మమ్ములఁ జేపట్టఁ ♦ గలుగఁ గాదె?
ఎదను జేయిడి హాయిగా ♦ బ్రదుకుటెల్ల.

వేయేల? ఆమహాత్ముని కృపారూపం బగు జలదమే మన్న యభ్యుదయ వృక్షమునకుఁ జిరజీవన మొసంగి రక్షించినయది.

(అంగదుఁడు సోత్కంఠుఁడై వచ్చి)

జనకా! ఆశ్చర్య మాశ్చర్యము.

ఉ॥ నెమ్మొగ మాత్మతాపహతి♦నిఁ దొలి తేజము మాసి సర్వ సౌ
ఖ్యమ్ములు వాసి గాసిలుటఁ ♦ గాయముడస్సియు ఘోరదారుణ
త్వమ్ము శరీర మొందిన వి♦ధమ్ముగ లక్ష్మణుఁ డేఁగుదెంచువాఁ
డిమ్మెయిఁ జూడుఁడీ! చెడుగు ♦ లేమి ఘటించునో సైనికాళికిన్॥

ఆతనియాకార మెంతటి వారి కైన భయోద్రేక మొదవింపకపోదు.

(లోపల ధ్వని - లక్ష్మణుఁడు.)

అయ్యా! కిష్కింధాధినాథుఁ డగు సుగ్రీవుని దర్శించుటకు మేము లోనికిఁ బోవచ్చునా?

వైతాళికుఁడు—మహాత్మా! మాల్యవంతప్రాంత వనవాసు లెవ్వరైనను రామ నిర్దేశితు లగువారు నిరాటంకముగ లోనఁ బ్రవేశించునదిగా మహారాజుగా రింతకు ముందే శాసించినారు.

(లక్ష్మణ ప్రవేశము - అందఱు లేచి నిలుచుందురు.)

ల—సార్వభౌమునకు జయసిద్ధిరస్తు!

సుగ్రీ—(చేరబోయి) దేవా! సర్వవైభవ పరిత్యాగముఁజేసి దేహమాత్రసహాయులైన మీవిధము శోచనీయముగదా? రామచంద్రునకు సేమమే?

ల—సుగ్రీవా! రామచంద్రుఁ డను నొక రాజపుత్రుఁడు నీజ్ఞాపకమున నున్నాఁడా? అతఁడును నేనును వనమ్ములఁ గ్రుమ్మరుటయు నీతలఁపున నున్నదా?

తా—(స్వగతము) వనవాసాయాస క్లేశంబున నితఁడు మహారాజుగారి యెడఁ దద్దయుఁ గుపితుఁ డైనాఁడు.

సుగ్రీ—సౌమిత్రీ! మీ శోచనీయావస్థవలన నట్లూహించెదరుగాని రఘురాము నెన్నఁ డైన మఱతునే? మీరు మాకు గురువంశములోనివారలు. ఇట్లుండ నెట్లు మఱవఁగలము? కాని కరుణాసముద్రుఁ డగు రామభద్రుఁడు నిన్నిటకుఁ బుత్తెంచు నపుడు తనభక్తుల మగు మా కేమి యానతి నొసంగె?

ల—మాయన్నగారి వినయ భీషణ గర్భిత వాక్యములు చాలఁగలవు; కాని ముఖ్యముగ నిటువినుము.

సీ॥ చక్రవర్తిపదంబు ♦ సరఁగఁ దాల్చి వెలుంగు
సుగ్రీవునకుఁ జాల ♦ సుఖమె? యనుము
గిరికందరముల దాఁ ♦ గిననాఁడు జేసిన
యాఅడింపుల మది ♦ నుంచు మనుము
గర్భశత్రువునిఁ బో ♦ కార్చి యొనర్చిన
మహ దుపకారంబు ♦ మఱవకనుము
మేలిమిఁ గిష్కింధ ♦ నేలఁ జేసిననాఁడు
తా నొనర్చిన బాసఁ ♦ దలఁపు మనుము
తే॥ గీ॥ కడకు నిన్నియుమఱచి సౌ ♦ ఖ్యంబు లంద
మరగియుండుట కార్యంబు ♦ తెఱఁగె ? యనుము
తనదు పలుకులు నిలుపంగఁ ♦ దలఁచెనేని
సాయ మొనరింప నిదిమంచి ♦ సమయమనుము!

సు—ఆహా! ఏమి యాకరుణా వ్యంజక భాషణములు? ఇందువలనఁ దనభక్తుల మగు మాకు రాజనీతియు నుచితప్రవర్తనమును దేటపఱచుచు బోధించినాఁడు.

ల—సర్వము నివేదించిన పిమ్మటఁ గిష్కింధా సామ్రాజ్యమునకుఁ బట్టభద్రునిఁగఁ జేసిన నాఁటి మహోపకారఁబుల నెఱింగి యొక వేళ నతఁడు మన యెడఁ గృతఘ్నుఁ డైనచో నిట్లనుమనియెను.

సు—ఏ మని?

ల— కం॥ ర మ్మనుమా! సేనల నిటు
తె మ్మనుమా, భూమిజా స ♦ తీమణి నరయన్
బొ మ్మనుమా, తన కిదె భా
ర మ్మనుమా, దీన జగము ♦ రంజిలు ననుమా.

సు—లక్ష్మణా!

సీ. అభిమానాతిఁ బరిమార్చి ♦ యతుల సంపదఁ గూర్చి
మా కొనర్చినమేలు ♦ మఱవఁ గలమె?
కిష్కింధ రాజ్యమ్ముఁ ♦ గృపను బ్రసాదించి
మా కొనర్చిన మేలు ♦ మఱవ గలమె?
యువరాజు చేయూఁత ♦ నొసఁగి రాజ్యముఁ దీర్చ
మా కొనర్చిన మేలు ♦ మఱవఁ గలమె?
నిజకృపా వీక్షణల్ ♦ నెఱపి నేఁటిదనుక
మా కొనర్చిన మేలు ♦ మఱవఁ గలమె?

తే॥ గీ॥ మహిత బహు లోపకారముల్ ♦ మఱవఁగలమె?
లక్ష్మణా! పలుమాటలే ♦ లా? సతంబు
సంధ్య దీపంబు వెట్టి ని ♦ శ్చల సుభక్తి
వినతు లొనరించు చుంటిమో ♦ యనఘ! వినుము.

కావున మీరు మాకిట్లు చెప్పవలయునే? మనోవాక్కాయ కర్మంబుల నేనతని నిరాకరింపలేదు. ఇంతకుమున్నే సీతనన్వేషించు నిమిత్తము పలువురం బలు దిక్కుల కనిచినాఁడ. వారును మాస మవధిఁ గైకొనిచనిరి. ఇఁక నైదుదినములే శేషించినవి. ఈ యైదుదినములిందు గడపుదుమేని తదనంతరము సర్వసైన్య సమేతముగ రాముల సన్నిధికిం బోవుదము. ఇంతలోఁ బ్రయాణ సన్నాహం బొనరించెదను. (భటునిఁజూచి) ఓరీ! సీతాన్వేషణమునకై పంపఁబడిన వారు దక్క తక్కిన యోధవీరుల నెల్లను బ్రయాణ సన్నాహమునకుఁ బురికొల్పి మాల్యవంత ప్రాంతారణ్యముల విడియు నదిగా మే మాజ్ఞాపించితి మని యువరాజునకుం జెప్పుము.

(నిష్క్రమింతురు.)

—:యవనిక:—





"ఓమ్"

# వీర విలాసము.

## ద్వితీయాఙ్కము.

ప్రథమ రంగము - మాల్యవంతాద్రి యందలి పర్ణశాల.

(సైన్య పరివృతుఁడైన రాముఁడు ప్రవేశించును.)

రా—సుగ్రీవా! సీతాన్వేషణమునకై పంపఁబడిన చారుల ముఖంబున నేమాటలు వెలువడినవి ?

సు—దేవా! దేశమ్ములుగాని దేశమ్ములెల్లఁ గ్రుమ్మరి క్రమ్మరితి మని యింతకు మున్దే నాతోఁ బలికిరి. కార్యవిఫలత్వము మీతోఁ జెప్పుటకు సంశయించు చుంటిని.

రా— సుగ్రీవా! సంశయమేల? ఇపుడెద్ది కర్తవ్యము?

సు—మారుతపుత్రాంగద జాంబవ ద్గవయ ప్రముఖుల దక్షిణ దిశ కనుప నెంచితి.

రా—కార్యపర్యవసాన మెట్లున్నను బ్రయత్న విముఖు లగు టొప్పదు. మంచిది. ఆంజనేయుఁ డెచట?

సు—మహాత్మా! ఎదుర వచ్చుచున్నవాఁడు.

(లోపల ధ్వని)

సీ॥ సురచక్రవర్తి భా ♦ సుర దయామూర్తి వి
శోల్లాసవర్తి సం ♦ శుద్ధకీర్తి
శ్రితభాగధేయ ని ♦ ర్జిత వైరి సముదాయ
పశుపతిగేయ దు ♦ ర్బల సహాయ
మారీచ సంతాప ♦ మహిత గుణ కలాప
మహనీయరూప స ♦ మ్యాప్తిదీప
సకల భయోత్పాత ♦ ప్రకట మనః ఖేద
పరిహృతపాద శం ♦ భత్ప్రిమోద
తే॥ గీ॥ దారితారి షడ్వర్గ మ ♦ ర్దమ నిసర్గ
భవపయోధి విలంఘ నో ♦ పాయకరణ

చరణముల నమ్మినాఁడ ని ♦ శ్చలత తోడ
రామ! దశరథరామ! ని ♦ స్సీమ ప్రేమ.

ఆనంద నిలయమై, యవాఙ్మానస గోచరమై చరాచర రాశిభూత ప్రపంచానుశాసనంబైన మీ దివ్యరూపము నాకన్నులారఁ గంటి. అశేషఁ భువనామోదకరంబగు రామాఖ్య సుధాలహరీ పరంపరఁ గ్రోలి యెవ్వాఁడు తనివిఁ బొందఁగలఁడు? ఓ మహనీయా! నిశ్చేతనమై జడమైన సూర్యకాంతము ప్రభాకరుని కిరణ సంస్పర్శనంబునఁ దేజోవంత మైనట్లు మీ సన్నిధిఁ జేరుటవలనఁ గలుష తమోవిముక్తుఁడనైతిని. యోగిజనహృద్య మైన నీ తారకనామము నాకలవడియె. నేనెల్లవిధంబుల ధన్యుఁడను.

రా—మారుతపుత్రా! మహాంధకారంబునకు ఖద్యోత ప్రద్యోతం బట్లు నీవలన మా కష్టంబులు నివర్తించెడుఁ గాక.

ఉ॥ ఈవు చరాచర ప్రభృతి ♦ కెల్ల నజేయుఁడ వౌదు వెద్దియున్
కేవల మౌనె? నీ కరయఁ ♦ గ్రించుఁదనంబ యగున్ గుమారకా
భూవలయంబునన్ గలుగు ♦ పుణ్యసరిద్వన గహ్వరంబులన్
దేవి విధంబు నారసి ప్ర ♦ తిక్షణమే చనుదెమ్ము సౌమ్మిఁకన్॥

ఆంజనేయా! సమంచిత రామకార్యనిర్వాహకుఁడ వగుము. చతుర్దశభువనంబుల నీ కసాధ్యములేదు. సీత యునికి నెఱింగి మరలివచ్చి నా ప్రాణంబుల నిలుపం బెట్టుము. ఇంకొక విశేషము. సీత పరమసాధ్వి యగుటయుఁ దా నిప్పుడు దుర్భర కష్టావస్థయం దుండుటయు నీ కారణములచేత నితరుల నమ్మఁ జాలదు; కాన నా యుదంతం బెల్ల నెఱింగించిన పిమ్మట నీయుంగర మామెకుఁ జూపుము.

ఆం—(ముద్రిక నందుకొని) (స్వగతము) మాయురే! ఈ ముద్రికను స్పృశించుటచేత మునుపటికంటె రెండింతలు సముత్సాహంబు నాకుఁ గల్గుచున్నది. (ప్రకాశము) దేవరయాజ్ఞ శిరసావహించువాఁడ.

సు—సైనికులారా! అంగద జాంబవ త్ప్రముఖులారా! రామకార్య నిర్వహణార్థము మీ కొక్కమాస మవధి యొసంగినాఁడ. లంకాపట్టణమంతయు వెదకి సీత వృత్తాంతంబుఁ గనుంగొని పక్షద్వితయంబునకే మరలవలయును; కానినాఁడు సుగ్రీవాజ్ఞ యను మాట సార్థకమగునని తలంపుఁడు.

జాం—మే మెంత ప్రయత్నించినను గార్యము విఫలమైనచో మ మ్మేమి చేయుఁడనెదరు?

సు—(సక్రోధముగ) విఫలమైనచో నీవు నీ ప్రాణంబులఁ ద్యజింపవలయు.

జాం—అయ్యో! ఇదియేమి యన్యాయము. చచ్చిన సర్పమును లోహదండముచే మోఁదినట్లు ముదుకఁడ నగు నా ప్రాణంబులకే మోసముఁ దెచ్చి పెట్టెదరు?

అం—దేవా! మే మిఁక గమనోన్ముఖులు గావలయు.

రా—మీకందఱకు మే లయ్యెడుఁ గాక!

సు—రామకార్య నిర్వహణ ధౌరేయులని పేర్వడయుదురు గాక.

(నిష్క్రమింతురు.)

(యవనిక.)

## ద్వితీయ రంగము—అరణ్యము.

అంగ—సహచరులారా! వింధ్యాచల మహారణ్యప్రాంతముల సాంతముగ వెదకితిమి, గిరిగహ్వరంబుల నన్వేషించితిమి. సీత యెందును గన్పట్టినజాడఁ గానము.

జాంబ—సీతసీతయని మొఱపెట్టెద రేల? సుగ్రీవునిచేఁ దప్పివచ్చితిమి. అతఁడును మాస మవధియొసంగినాఁడు కదా? ఇంతలో మహారణ్యములలోని మధురఫలముల భక్షించుచు సుఖముగ నుండి తుదకు గడువుదినమునఁ బ్రాణపరిత్యాగముఁ జేయుదము. ఇంతియెకాని సీత మనకులభించుటలేదు. లేనినాఁడు వీరు మనలను బ్రదుకనిచ్చుటయులేదు. ఇట్టిపనికై వ్యర్థప్రయాసలు పడ నేల? నాకిప్పుడు దాహము మితిమీఱి యున్నది. అదిగో దవ్వుల నున్న యామ్రవృక్షమునీడను జలాశయమున్నట్లున్నది. పోదము రండు. (కొంతదూరము నడచి కూర్చుండును).

తే॥ గీ॥ ఖరకర మహాతపంబునఁ ♦ గాఁగి కాఁగి
కడఁక వన్యంబులె న్నేనిఁ ♦ గడచికడచి
మేనువివశత్వ మొందెడు ♦ గాన నింక
దుర్గ మాటవిఁ జొచ్చుట ♦ దుష్కరంబు.

అంగదకుమార! జరాభారగ్రస్తుండ నగుట నా కంతంతకు గమనాయాసము మెండగుచున్నది. ముందునకు సాఁగిపోవుట నావలనఁ గాదు. ఎందైన జలములఁ దెచ్చి యిండు. లేకున్న నేఁ బ్రాణములు వదలుదును.

నీలు—తాతా! అంతపని సేయకు. ఇందెందు వెదకినను సలిలములు దొరకుట దుర్లభము.

గవా—ఇచ్చటకుఁ గొంతదూరమున నదిగో జలపక్షు లందంద చరించునట్లు పొడకట్టుచున్నది. ఆస్థలంబున జలముండును. పోదము రండు.

(యవనిక పడును.)

## తృతీయ రంగము—గుహ.

అం—రామణీయక ప్రదర్శక మగు నీగిరిగహ్వరముఁ గంటిరే?

తే॥ గీ॥ చిత్త సంయమనముఁ జేసి ♦ శ్రీనివాస
పదజలజముల నెదఁగోరు ♦ భక్తులకును
వర తపశ్శక్తులకును ని ♦ వాసభూమి
విజనముగఁ దోఁచుచున్న దీ ♦ విధము గనుఁడీ.

సహచరులారా! ఈగుహాబిలముఁజొచ్చి యిందలి విచిత్రముల నరయుదము రండు. (గుహలోఁ బ్రవేశించి)

౦లు—అల్లదే గక్త ప్రభా భాసుర మగు ముఖమునకు విభూతి నలంది కాషాయవస్త్ర ములు గట్టి భువనభయంకరమూర్తియై కఠోర తపమాచరించు చున్న యామెను జూడుఁడు. (అందఱుఁ జేరఁ బోదురు)

ఆం—

తే॥ గీ॥ అపర కాత్యాయనీమూర్తి ♦ ననుగమించి
మించు తపమున నిట్లు ౖ ♦ శించె దేల?
ఇందు రాదుగదా? సీత ♦ నెందునైన
దాఁచినావో? వచింపుమీ ♦ దాఁచ కిఁక.

సాధ్వీలతికా సన్నిభమూర్తినిఁ దపోగ్నిచేఁ గాల్ప నేల? ఎందులకిట్టి కఠోర తపంబునకుఁ బూనితివి. మేము మార్గాయాసమునం జేసి యిందుఁ జొచ్చితిమి. కలమాట వచింపుము.

(స్వయంప్రభ లేచి)

మహనీయులారా! నాతపంబుం గూర్చి ప్రశ్నించితిరి గాన నిటువినుఁడు. రాక్షస వంశంబునఁ బొల్లి బలఢారేయుం డగు మయుం డొక్కఁడు కలఁడు. అతఁ డఘట నాఘటన పటిష్ఠుఁ డగు పరమేష్ఠిం గూర్చి తపం బాచరించి ఆ ద్వారప్రసాదంబునఁ గనకమయంబగు నగరంబొకటి నిర్మించి యందు 'హేమ' యను సుందరాంగినిఁ బ్రేయసిఁగాఁ గైకొని సుఖించుచుండెను. అట్టి వైభవమునకు సురరాజు సహింపలేక పోయెను.

ఆం—సరులయాధిక్యత కోర్వలేమి సర్వులకును గలదు.

జాం—సరుల కలిమిఁ జూచి నవ్వు డసూయాపరులు తమకన్నులలో నిప్పులు వోసి కొందురు.

స్వా—అట్లు మయునియున్నతదశకుఁ జాల నసహ్యించుకొని తఁద కింద్రుఁడు కులిశ ధారచే నతిదారుణముగ, నిష్కారణముగ, నతనితలఁ దెగవ్రేసెను.

జాం—అకటా! ధనవంతు లధర్మపథంబున నున్నను వారినిఁ గాదనువారు లేరు.

గవా—ధనవంతులే తఱచుగ నిట్టి యధర్మకృత్యంబులఁ జేయుచుందురు. ఎట్లనఁ

తే॥ గీ॥ బాలు రనక సద్ధర్మసం ♦ శీలు రనక
నిరపరాధులతలలు ఖం ♦ డించుచుంద్రు
రాజదండన మనియెడి ♦ వ్యాజమునను
బీదలివి యొనరించిన ♦ భేద మొదవు.

ఆం—కనక మెంతపని యొనర్చుచున్నదిః అధర్మము ధర్మముగాను హత్యలు శిక్షలు గాను మార్చు నట్టి యద్భుతశక్తి దానికిఁగలదు. మఱియు,

తే॥ గీ॥ జగతి ధనికుఁడు పలువురఁ ♦ జంపెనేని,
యుక్త మగునని మాటాడ ♦ కుంద్రు లోకు

లలుక నొక్కని బాధింప ♦ నఖిలజనులు
నిర్ధనుని హంతకుం డని ♦ నిర్ణయింత్రు.

స్వా—అనంతర మతనిధర్మపత్నిని నీడలంబెట్టి యంతటితో నూరసుందక యూమెను దన వెనువెంట నీడ్చుకొనిపోయెను.

నీలు—అయ్యో! ధనలోభ మింద్రు నెంతటి యధర్మమునకుం బాల్పఱచెను? అమ్మా! చెప్పుము, చెప్పుము.

స్వా—నేను వా రిద్దఱకుం బరిచర్య లొనరించు చుంటిని. నాయజమానురా లట్లనాథయై యింద్రునిచేం గొంపోంబడునపుడు నన్నుంజూచి నీ విప్పుడు నిరాధారురాలవైతివి. మృగతృష్ణా ప్రవాహంబుంబోలె కోర్కెలంగల్పించు నీకలిమి శాశ్వతముగాదు సుమా! వీనినన్నింటిని త్యజించి తపోనియతిం బూనుమని చెప్పి పోయిన నాంటంగోలె నే నిందే తప మాచరించుచున్నాను. మీ రెవ్వరు? మార్గగాము లగు మీ రిందు రాంగతం బేమి?

అం—

కం॥ ఇనకులతిలకుండు దశరథ
తనూజుం డగు రాము నాజ్ఞం ♦ దలందాల్చి సుమీ
వనులం జరియింతు మీగతిం
దనసతి నెడంబాసియతండు ♦ దలంకుట కతనన్

పరమసాధ్వినియగు తనప్రాణదయిత నెడంబాసి రాముం డరణ్యములంబడి విలపించుటచే మే మాసతీమణి నన్వేషించుటకై వచ్చినారము. ఘోరారణ్యములం దిరుగుటచేం బొడమిన పిపాసా శమ నార్థమై యిందుం జొచ్చినారము. తల్లీ! మాకు జలంబులెందు స్థలంబుం గాన్పింపుము.

స్వా—హా! ధన్యము ధన్యము. మహనీయులారా! మీరే పూజ్యులరు ఎట్లనన్?

కం॥ తపముల దాన వ్రతముల
నెప్పుడు గనుంగొనంగరాని ♦ యినకులజుని స
త్కృపకుం బాత్రు లగుట మీ
తపములు ఫలియించె మీరు ♦ ధన్యులుగారే?

పుణ్యమయులారా! రామ కార్యానురక్తులైన మీదర్శనమునం జేసి నేనును ధన్యనైతిని. నేనింకం గాంక్షింప వలసినది లేదు. మీ రచిరకాలంబున నే కార్యము పండించుకొని రాంగలరు. ఈ జలములం ద్రావుడు. మీ కెందును త్వద్బాధ కలుగనేరదు. (అందఱు జలము లానిన వెనుక)

అం—దేవీ! నీసమంచి తాలాపముల వలన మేము శ్రాంతిం బొందితిమి. ఎప్పటియట్లు మమ్ము లాతలంబునం జేర్పుము.

(యవనిక)

## తృతీయ రంగము— సముద్రాంతిక భూమి.

అం—మారుతీ! బహుళ దుర్గమ ప్రయత్నము లొనర్చియు నింతవఱకు సీతా మహాదేవి నెఱుంగ మైతిమి. ఆసేతు హిమాచల పర్యంతము మనము వెదుకని స్థలంబులేదు. ఇఁక నీపారినె దక్షిణమునకుఁ గదుద వ్వేగవలయు. అల్లదే! తరంగ సంకులము రత్నాకరము భీకరమై చెలరేఁగు చున్నది. దీనినిఁ గడచికదా ముందుకు పోవలయు.

జాం—అంగదా! నక్కకు నాకలోకమున కెంతయంతరము? శతయోజన విస్తృతమగు మహార్ణవమేడ? మనమేడ? చెట్టుకొమ్మ లెక్కి దుముకుటయని తలంచితిరా? ఇక్క యదుగేనియు ముందిడితిమా సర్వులు నిశ్చయముగ సముద్ర గర్భంబుఁ జేరుదుము. స్వల్పజలాశయము ననుకొంటిరా? దుర్లంఘ్య మగు కార్యగతికి దొరకొనుట కంటె నిశ్చింతంబుగ బ్రాణములు విసర్జించుట మేలు. సముద్రమునఁ బడినవెనుక ప్రాణములువోక పరితపించుట కంటెఁ జిత్తము శ్రీరామార్పణ మొనర్చి ప్రాయోపవేశ మొనర్తము రండు. చచ్చినవెనుక నేదియెట్లువోయిన మనకేమి?

నలు—సార్వభౌమ సమానులగు యువరాజుగారే యింత చింతిలు చున్నప్పుడు మనము సాధింపఁగలమా? కావున నేను ప్రాణపరిత్యాగమునకొప్పుకొంటిని.

గజు—నే నిందులకు సమ్మతించితిని.

మై—నా కిది యిష్టమె.

గవా—నేను మడియుటకు సమ్మతించితిని.

సుషే—నేనును మిమ్మనుసరించెదను.

విన—నేనుగూడఁ జచ్చుట కొప్పు కొంటిని.

నీలు—మీరందఱు మున్నుగఁ జచ్చిన నే నావెనుకఁ బ్రయత్నించెదను.

జాం—అయిన నందఱొక్కసారిగఁ బ్రాణత్యాగమునకుఁ బూనుదము రండు. (స్వ) ఇది బాగున్నది. వీరితో నేనుగూడ ప్రాయోపవేశ మొనర్చువానివలె నటించి తుదకు వీరందఱుఁ జచ్చినవెనుక నిన్ని తిలోదకములు విడిచి సుగ్రీవుని కంటఁబడకుండ నెందైన దాఁగియుందును.

(అందఱు శయనింతురు.)

(కొంతసేపునకు జాంబవంతుఁడు లేచి యిటు నటుఁజూచును)

నీలు—ఏమితాతా! లేచితివి.

జాం—(స్వ) వీరందఱుఁ జచ్చినవెనుక నెందైన దాఁగియుందుదమన్న వీరునన్ను వీడు నట్లు లేదు. (ప్ర) సర్వప్రాణుల కన్నిటికంటెఁ బ్రాణ మెక్కువ తీపిసుమా! తెవులు గొన్న దేహమును విసర్జించుటకే కష్టమగుచుండ నేకష్టముగాక రోగములేక యున్నట్లుండి నిందు ప్రాణముల బలవంతముగఁ బోఁగొట్టుకొనుట కెవఁడు సాహసించును?

గవా—ముదుకఁడ వగు నీవే ప్రాణమును శంకించినచో మమ్ము [illegible] నేల చావుమంటివి?

జాం—లోకంబుపాడి మొదట నట్లంటిని; గాని బలవంతముగఁ బ్రాణములు వాయుట యన్న నా కిష్టము లేదు. ఇది యిట్లుండఁ దనంత జీవింపక మన సుగ్రీవుఁడు రాములతోఁ జెల్మి యొనర్చి పరాధికారము పయి బెట్టుకొననేల? తత్కార్య నిర్వహణమునకై నడుమ మన యుసురులు గొననేల?

నీలు—జాంబవంతా! ఏమి యిట్లనెదవు? స్వామి హితంబుఁ దీర్పని వాఁడెట్టి భృత్యుఁడు? రాజున కొకవిపత్తు వచ్చినపుడు భృత్యుఁడు తనచేతనైనంత సాధింపవలెను: కాని రాజు గుణలోపముల నెన్నుట నీతి గాదు.

గవా—అయిన నిపు డెద్ది కర్తవ్యము?

జాం—అందఱము సముద్రమునఁ బడి చచ్చుటయే!

సుహో—అదేల? పర్వత బిలంబుల నెందైన దాఁగికొనుట మేలుగాదా?

ఘన—అపుడు సుగ్రీవుఁడు మనలఁ బో నిచ్చునా? సుగ్రీవాజ్ఞ కదా! కాలదండము నైనఁ దప్పించుకొన నగునుగాని సుగ్రీవాజ్ఞఁ దప్పి చరింప నగునా?

గవా—ఇవి యన్నిఁటికంటె జాంబవంతుని తొలి నీతి ననుసరించి యతనితోఁగూడఁ బ్రాయోపవేశ మొనర్చుటయే మేలు.

జాం— లోకంబుపాడి మొదటనట్లంటిని గాని బలవంతముగఁ బ్రాణములు వాయుట యన్న నా కిష్టములేదు. ఇఁకమీఁద మీ మీ యిష్టమువచ్చినట్లు చేయవచ్చును.

అం—ముదుకఁ డగు నితనికిఁ బ్రాణములపై గంపెఁడాస కలదు.

(నేపథ్యమున విషాద ధ్వని)

తే॥ గీ॥ అతిదయా సమేతంబయి ♦ యమలిన మయి
చూడఁజూడ మనోహర ♦ సుఖము నిచ్చు
తమ్ముని ముఖమ్ము నిఁక నేవి♦ధమ్ముగాంతుఁ
బాయఁ జేసెను విధియెంత ♦ పాపియొక్కొ?

అంజ—(శ్రుతి నభినయించి) జాంబవంతా! రామ కార్యార్థమై మేను గోలుపుట శ్రేయస్కరము. చూడుము రామకార్యార్థమై కాదె తొల్లి మహాసత్వ సమంచితుఁడగు జటాయువు నిస్సంశయముగఁ బ్రాణము లర్పించుట?

(దుఃఖితుఁడై సంపాతి ప్రవేశించును.)

అయ్యో! ఆనంద దాయకమైన నాయనుజునినామ మిచ్చట శ్రావ్యముగ వినవచ్చుటకుఁ గారణమేమి? (పరికించి) ఇచ్చట నెవరో చరించుచున్నట్లున్నది. (చేరఁబోయి) ఓదయామయులారా! నాతమ్మునిఁ దలపెట్టుచున్న మీ రెవ్వరు? ఇచ్చట దీనముఖులై యేలయిట్లు పలవించెదరు?

అం—అయ్యా! మేము సుగ్రీవ భటులము; రఘురాముని దేవియగు సీత నన్వేషించుట కైవచ్చి యీ మహత్కార్యము సాధించు వెరవు గానక తుదకు ప్రాణములు విడువ నిశ్చయించుకొని యిట్లు పడినారము.

సం—ధన్యము. ధన్యము. మీరు రామకార్యార్థమై వచ్చితిరా? అట్లయిన నాజటాయువు విధ మెఱింగియుందురు. నే నతని సహజన్ముఁడను. తొల్లి మే మిద్దఱము తపఁడిదర్శనార్థమై యేగుతఱిఁ బ్రళయాగ్ని తీక్ష్ణమునను నాపక్షములు భస్మీభూతము లయ్యెను. పూర్వపుణ్యవశమున నాతమ్మునికెక్కులు కమర లేదు. పక్షములు భస్మీభూతములగుటయు జవసత్వములు దూల నేలఁ బ్రాలి సమీపస్థ పర్వతశిఖర మధిరోహించి నాఁటఁగోలె నిందే జీవించువాఁడ. పిమ్మట నాజటాయు వెయ్యెడకేగెనో యెఱుంగలేక పోతిని. అతఁడు సుఖియై యిప్పుడెయ్యెడ నైనఁ గాలము బుచ్చుచుండునా?

అం—ఖగోత్తమా! లోకవిద్రావణుఁడగు రావణుఁడు ఘాతుకవృత్తిచే సీతామహాదేవినిఁ గొని చనునపు డాసాధ్విని విడిపింపఁదలఁచి రావణు నడ్డగించి యతనితో సంగ్రామ మొనర్చి మాయామయశిలీముఖములకుఁ దాళలేక నేలఁబడెను.

సం—అకటా! దుర్మార్గులే యెయ్యెడ జయముఁగాంచుచున్నారు. అయ్యా! చెప్పుము చెప్పుము.

అం—పక్షములు విఱుగ, నట్లు నేలంబడి సర్వావయవములు శోషిల్లఁ గృశించి రామధ్యాన మొనర్చుచుఁ బ్రాణములువదలెను.

సం—ఏమి? నాహృదయము నమ్మఁజాలకున్నది.

అం—ఖగోత్తమా! ఇదినిక్కము. నిజముగనే జటాయువు లోకాంతర గతుఁ డయ్యెను.

సం—అయ్యో! తమ్ముఁడా! నిజముగనే నన్నుఁబాసి చనితివా? అకటా!

తే॥ గీ॥ జనకుఁ జేరఁగఁ బోయెడు ♦ సమయమందు
ర న్ననుజ! పోద మనుచు హి ♦ తమ్ముదోఁప
నెంతయును గూర్మిఁజేరువా ♦ రెవ్వరింకఁ
దమ్ముఁడా! ననుఁబాసితే ♦ దైవగతిని.

సర్వవిధముల నన్నుఁ బ్రాణముకంటె నెక్కుడుగఁ బ్రేమించుచుంటివి. నీదయాస్వభావ మెంతని వర్ణింతును? నీప్రసన్నవదన మెయ్యెడఁ బొడఁగాంతును? న న్నొంటిఁజేసి స్వర్గ మలంకరించితివా? తండ్రీ! జగ దభ్యుదయకరుండవగు నీ జననకాలమున,

కం॥ విహఁగోత్తముఁ డురువిక్రమ
సహితుం డై తద్దయుఁ బ్ర ♦ జాహితముగ ని
మ్మహి మనెడు ననుచుఁ బల్కిన
విహితుల వాక్యములు నేఁడు ♦ వృథలయ్యెఁ గటా!

అక్కటా! ఎంతవిలపించియు నేమిప్రయోజనము? త్రిమూర్తులు గుమిఁగూడియైన నాతమ్మునిఁ దేఁగలరా? ఆర్యులారా! నిష్కారణముగ మీ రేల ప్రాణములు విడిచెదరు? ఇచ్చటికి శతయోజనంబులదూరమున లంకయనుపుర మున్నది.

క్రూరుఁ డగు రావణుఁడు సీత నం దునిచినవాఁడు. మీ రీమహార్ణవముఁగడచి చనిన లంకయం దాదేవినిఁ గాంచఁగలరు. మీసందర్శనభాగ్యమునఁ బవిత్రుఁడ నైతిని. మహనీయులారా! నే నిపుడు హీనసత్త్వుఁడను; లే కున్న నీక్షణంబున లంకఁ బ్రవేశించి రావణునిసంహరించి సీతనుగొని తెచ్చి మీఁకిచ్చిరామకార్యముఁ దీర్చి నాతమ్మునివలె నేనును గృతకృత్యుఁడనై యుందును; కాని యంతటిపనులు నోచుకొనలేదు. నా కిఁక సెలవిండు.

అం—మహాత్మా! మా వందనములు గైకొని చనుము.

(జయ జయ ధ్వనులు చేయుదురు.)

---

(చతుర్థ రంగము.—సముద్రతీరభూమి.)

అం—రామా! లోకాభిరామా! ప్రయత్నలోపము మావలన లేకుండ నింత వఱకు సీతను వెదకి వెదకి యామెయునికిఁ గనుఁగొంటిమి. క్షోణీతలమున నెందున్నను గార్యము సాధించి యుందుము. శక్తి వంచనము మాయందు లేదు. శతయోజన విస్తీర్ణ మగు మహార్ణవమఁట! అటవీచరులు నిర్గమింతురఁట. ఇది సాధ్యమా? కాని నాఁడత్యధిక ప్రయత్నముచే సీత నిజవృత్తాంత మెఱుఁగక రిక్తకరములతో మీ చెంతకెట్లు జేరుదుము? అకటా! ఇపుడెద్ది కర్తవ్యము?

నీలు—సముద్రనిర్గమనంబుకంటెఁ గర్తవ్యాంశము వేఱొండు లేదు.

గవ—క్షణక్షణంబును బోటరివోలె బలదర్పంబులు పలుకుచున్నాఁడవు. నీ వెంతద వ్వేగఁ గలవో మొదట బయల్పడనిమ్ము.

నీలు—అరువది యోజనము లవలీలఁ దాఁటెదను. నీవు?

గవ—నేను ముప్పది.

గవా—గంధమాదనా! నీ వెంత దవ్వేగ నేర్తువు?

గం—నన్ను. బొమ్మన్నచో సముద్రమునఁబడి చత్తును. నన్ను బోధింపకుఁడు.

సుహో—వినతా! నీ వే మందువు?

విన—నేనొక్క యడుగేనియు ముందిడ నందును.

గజు—సుహోత్రా! నీదర్పముగూడఁ జాటరాదా?

సు—వాహాకు లిందెవరైన నేర్పడినచో రావణసౌధంబుపై బ్రాలెదను.

దధి—యువరాజా! నీ బాహుబలిమి నేఁడు కదా సార్థకము గావలయు!

అం—సంపూర్ణముగ నీ యంబుధి లంఘించి సీతను దర్శించువాఁడఁగాని మఱల రాఁ జాలను.

నీలు—అందఱి శక్తు లింతకు వచ్చినవి. కాని చింత యుడుసలి యైనను ఫలంసు మెండ న్నట్లు నీవు మాకుఁ బెద్దవు కదా. నీ శక్తి యెంతవఱకుఁ బనిసేయును? జాంబవంతా! చెప్పుము.

జాం—నా శక్తి సాత్రాంతాంత మగు వఱకుఁ బనిసేయును.

అం—అట్లయినఁ గర్తవ్యాంశము మా కందఱకు నీవె యాలోచించి చెప్పుము. సుకరం బగు నేని నీమార్గమె మేమందఱ మనుసరించెదము.

జాం—మంచిది. సుకరంబగు మార్గమొక్కటి యాలోచించి చెప్పెద వినుఁడు.

సీ॥ జలనిధిఁ జొచ్చిన ♦ జలజంతువుల ముఖా
దరబిరములఁబడి ♦ తరల రాదు
తరలితిమేని, దు ♦ స్తర పరిఖావృత
లంకా పురంబుఁ జే ♦ రంగరాదు
చేరితిమేని, మ♦ హోరథుల్ రాక్షస
వరులదృష్టులఁబడి ♦ బ్రతుకరాదు
బ్రతికితిమేని, ని ♦ ర్జితవైరి రావణు
చేఁ దప్పి కిష్కింధఁ ♦ జేరరాదు
తే॥ గీ॥ తెలియ రాముకార్యంబు సా ♦ ధింపరాదు
రానిచో నినజునిచెంత ♦ బ్రతుకరాదు
కాన రెంట నింతయును సౌ ♦ ఖ్యంబులేదు
రామరావణ మధ్యము ♦ రంగమందు
బ్రాణ మురివోసి కొనుటయే ♦ పరమ సుఖము.

గవా—ఇతఁడు మఱల మొదటికే వచ్చుచున్నవాఁడు.

జాం—ఇంతకంటె కర్తవ్యాంశము నాకెఱుక పడలేదు.

గజ—ఇందఱి వీరయోధులలో నొక్కని నోటనైన వీర రసోచిత వాక్యములు వెలి పడవు.

జాం—ఎవ రున్నారు? కబళమన్నఁ దెఱచువారును, గళ్ళెరున్న నోరుమూయువారును నిం దమిత సంఖ్యాకులు గలరు.

అం—ఎంత ప్రయత్నించియు మనకిది దుష్కరము. ఈకార్యము వాయుపుత్రునితో దుదముట్టవలెను గాని, పెరలకు దుర్లంఘ్యము. ఆంజనేయుఁ డెచట?

గం—యువరాజా! ఇదిగో చెట్టునీడన తూష్ణీంభావమునఁ గూర్చున్నవాఁడు.

అం—విపదంబుధిం బడియున్న మనము వాయుపుత్రుఁ డనెడి మహానౌకంగాని దరిఁ జేరవచ్చును. కాన మనమందఱ మతనిఁ బ్రార్థింతము.

నీలు—అవును. ఈ గొడవలకంటె నతనిఁ బ్రార్థించుటే మేలు. రండు పోదము.

(చేరఁబోయి)

అం—ఓ మహనీయా!

ఉ॥ ఈవు చరాచర ప్రభృతికెల్ల న ♦ జేయుఁ డవంచుఁ జెప్పిరో
దే! విభుఁడంపె నిన్నిటకు? ♦ నెల్ల విధంబుల నీవ యోపుదో

పావని! మిన్నకుండుటిది ♦ భావ్యమె? రమ్మిక రామకార్య మిం
దేవిధినైనఁ దీర్పుము! న♦రేంద్రునకుం బ్రమదంబు గూర్పుమా!

మారుతీ! నీ వమోఘ సంకల్పుఁడవు. నిజబలంబున నెట్టికార్యంబేని సాధింతువు. మహాబలుండవు. నిన్నుమించిన దిట్టయును లేదు. అట్టినీవు నేఁడు మౌనమూని యుంటచే మాశక్తు లేమియుఁ గొనసాగవు రమ్ము! స్వామి హితంబుఁదీర్పఁ బ్రయత్నింపుము.

అందరు—నీటముంచినను పాలముంచినను నీదేభారమని నమ్మి, నీకతన సుగ్రీవ ప్రాణమున కాహుతి గాకుండ బ్రతికెదమని నిశ్చయించుకొన్నారము.

ఆం—సహచరులారా! మీరింత భీతావహులు గానేల? ఎట్లయిన మనతలపైఁ బడిన యీకార్యము నిర్వహింపక తప్పదుకదా? సుగ్రీవాదేశమునను రామ ప్రేరణ సముత్సాహంబునను మీ యుత్సాహ వాక్యముల చేతను, సముద్రనిర్యాణము సేయువాఁడ. మనోవాక్కాయ కర్మంబుల రామకార్యంబుఁదీర్పఁ బ్రయత్నింతు మేని, జగత్సంస్తూయమానుండగు నతని కారుణ్యము మనయెడఁ గలుగు నేని సుఖముగ సముద్రము నిర్గమించి మించి భూమిజం గాంచి మఱలువాఁడ. ఒకవేళ సామోపాయమునఁ గార్యసాధనము కాదేని,

మ. ధరణీజాతను నాకుఁ జూపనియెడన్ ♦ దర్పంబువాటించి, యా
సురలంబట్టి కలంచెదన్ దపసులన్ ♦ స్రుక్కించెదన్, గానిచో
సురనాథుల్ గిరినాథు లిందఱును సం ♦ క్షోభిల్ల బ్రహ్మాండక
ర్పర నిర్భేదనమాచరించెద. నకా ♦ ర్యంబెద్ది? నా కిన్నిఁటన్॥

ఇట్లు సమంచిత సంరంభ సమన్వితుఁడనై

ఉ. క్రిచ్చఱఁ బోరు శాత్రవుల ♦ గాఢతరంబుగ ముష్టిసంహతిన్
వ్రచ్చెద, దేవదానవు ల ♦ వారణనడ్డము సొచ్చి రేనియున్
జొచ్చెద లంక, నిష్టగతి ♦ సుమ్ము! సుఖంబున నుండుఁ డింక నేఁ
దెచ్చెద సీత వృత్తము, న ♦ తి ప్రమదంబు జగద్ధితంబుగన్॥

జాం—ఇంతవఱ కెవ్వరి నోటనుండియు నిట్లూపి రాడినది కాదు.

అం—ఇపుడు మేము సుగ్రీవానుగ్రహమునకుఁ బాత్రులమైనారము.

నీలు—ఇంకనిటఁ దడయనేల?

(ఆంజనేయుఁడు తీరభూమి దరియఁబోయి)

ఆహా! అనవరత రామభక్తి పరాయణుల కెయ్యది దుర్లంఘ్య మగును?

మ. ప్రళయంబందున జీర్ణపర్ణమది త ♦ ల్పంబై, గ్రహగ్రాహ సం
చల దుత్తుంగ తరంగ సంగత మహా ♦ సంత్రాసదంబైన, యా
జలధిన్ గ్రీడల నోలలాడె దఁట! శ్రీ ♦ శా! నీదుభక్తుండఁ, గే
వలమూఢాత్ముఁడ, నీకృపారసము నా♦పైఁజూపుమా! మ్రొక్కెదన్॥

ద్వితీయాశ్వాసము.



# వీరవిలాసము.

## తృతీయాఙ్కము.

### ప్రథమరంగము.

(లంకలోని దుర్గప్రాకారము—— ఆంజనేయుఁడు ప్రవేశించుచున్నాఁడు)

ఔరా! భాగ్యదేవతానిలయమై శాత్రవపట్టణము కరము విరాజిల్లుచున్నయది. ఈ దుర్గమందు జయముగాంచుట సుగ్రీవునకుఁ గష్టతరముగఁ దోఁచుచున్నది. సముద్రేక మగు నుదధిలంఘించి సైనికు లిచటి కెట్లురానేర్తురు? కాని మ్మివి యన్నియు దైవాయత్తములు. ప్రస్తుతము నేనీదేహముతో స్వచ్ఛందవృత్తిఁ జొచ్చితినేని రక్కసుల కంటఁబడకుండ మఱలుట దుర్ఘటము. గూఢమగు దేహముతోఁ జొచ్చెదఁగాక. (పోబోవును లంక యడ్డమై.)

ఓరోరి! కృత్రిమస్వరూపా!

మ॥ సురులున్ మానులుసిద్ధసాధ్యులును సం ♦ శోభింతు రెవ్వాని భీ
కరమూర్తిన్ గనినంతమాత్రినఁ, దిగ్లో ♦ కంబందు నెవ్వాని కీ
ర్తిరహించెన్, వినుమట్టి రావణుని యా ♦ దేశంబునన్ గాక హాహా?
నరమాత్రుండు సనంగ నేర్చెనె? మదో ♦ న్మాదంబుదా హెచ్చెనే?

ఓరీ! నిర్భయంబుగ లోని కరుగంబోయెద వేల? నీవెవ్వఁడవు?

ఆం:—అమ్మా! బహుదేశ గమనాయాసంబునం జేసి యీరాత్రి యిచ్చట విశ్రమింపఁ గోరి పోవుచుంటిని. ఎల్లపుడు దేశదేశములఁ గ్రుమ్మరుచుఁ బుణ్యస్థలముల దర్శించుచుందును. రావణప్రభావంబు విని యతనిఁ జూడఁగోరియే పోవుచుంటిని. నేను దండకారణ్యమునుండి వచ్చిన యొక బ్రహ్మచారిని.

లం:—ఛీఛీ! దండకారణ్య వాసుల నెవ్వరి నేని నిరాకరించు మనియని రావణాజ్ఞయైనది. శాత్రవు లెవ్వరిందుఁ జొరకుండునటుల నేనీదుర్గరక్షణము సేయుదును. నిన్ను లోనికిఁ బోనిచ్చుట లేదు. కృత్రిమ స్వరూపుఁడవగు నిన్నుఁ బోనిచ్చుటఁ గన్నులారఁ జూచియు గరళమును భక్షించిన చందమగును. మఱియు మన్నుఁ గట్టఁ బ్రాణ్ము మేమే తెచ్చికొన్నట్లగును.

ఆం:—అమ్మా! ఏమి యిట్లనెదవు?

తే॥ గీ॥ దర్శనార్థి నేనొకఁడ ♦ గఁదలఁచినంత
నగరపునకు మేలు కీడు లె ♦ వ్విధి ఘటించు

నలఁతి స్రోతస్వినియొకండు ♦ గలసె నేని
జెలఁగు రత్నాకరమునకుఁ ♦ జేటుకలదె?

లం:—ఆహా! నీ కృత్రిమములకు మోసపోవు దానఁగాను.

తే॥ గీ॥ శత్రుపక్షమువారల ♦ స్వల్పజనుల
నేని యొప్పరికింపఁ గీ ♦ డౌను జూవె!
కడలి నపవిత్రమొనరింపఁ ♦ గాలకూట
బిందు వొక్కటిచాలదే? ♦ పృథులశక్తి?

కావున లంక యీకపటములకా మోసపోవును?

ఆం:—దానవీ! నేను పురిఁ బ్రవేశించినంతనే సమూలముగఁ జెడదు. ఎట్లనిన?

తే॥గీ॥ సుగుణులకుఁ గీడుఁరోయక ♦ జగతినెందు
సంచరించెదు నేఁబోవఁ ♦ జాలినంత
చెడునె రాజ్యంబు? దహియింపఁ బడునె లంక?
మడియుదురె రాక్షసుల్? వింత ♦ మాటలేల?

లం:—మానవాధమా! కాఱుకూఁతలు గూయకుము. ఇఁకఁ దడసితివా నీదేహము పలల ఖండములుగఁ జేసిభక్షించెద. ప్రాణములు రక్షించుకొను నాసగలిగెనేని తొలఁగిపొమ్ము.

ఆం:—దానవీ! నీకొలఁదిబలము నీవెఱుంగక ప్రేలుచుంటివి. అయినను నబలలతో సంగరమొనర్చుట మా యాచారముగాదు. కాన నేనిమ్ము మననిచ్చితి. నీకు దారిఁ జూపుము.

లం:—ఛీ! కష్టాత్ముఁడా! మేమింతవఱకు నుపేక్షించినందున నీగర్వమంతంతకు మితిమీఱుచున్నది. ఇదె నా వ్రేటునంబడి యెందేగెదవు?

(అని హస్తవిన్యాసముఁ జూపెను.)

ఆం:—ఆహా! అబలలకు సబలత్వము నేఁడుకదా! కంటినిని? దానవీ! గర్వాంధ విద్వేషిజన నిర్మూలనాఖిల విహరణమగు నా ముష్టి ప్రహరణమునకుఁ దప్పించుకొమ్ము.

(ముష్టిఘాతముఁ జూపును. ఘోరశబ్దముతో లంక నేలఁగూలి)

ఓ శాత్రవహృదయ నిర్భేదనోపాయ కరణధురీణా! వాయుసూనా! ఇదేనా ప్రార్థించునది వినుము. జగద్ధిత కార్యార్థియైన మానవుం డొక్కఁడీలంకం బ్రవేశించి నిన్నేనాఁడు బంధించు నదియాదిగా ముడివీడిన సరములోని ముత్తెములట్లు క్రమక్రమముగ రాక్షస క్షయముగల్గునని యీలంక నిర్మించునాఁడు హిరణ్యగర్భుండు నాతోఁ బల్కె. అతని శాసనమును దప్పదయ్యె. నీకీధరాతలమున నెద్దియు దుస్సాధ్యముగాదు. సత్వరంబుగఁ గార్యసంసిద్ధియయ్యెడు. నాకిఁక సెలవొసంగుము. నీవలన దివ్యలోక ప్రాప్తికలిగినది.

(నిష్క్రమించును.)

ఆం:—(ద్వారము సమీపించి) అంతఃపురములోని వారెల్లరు గాఢనిద్రా నిమగ్నులై యున్నారు. అల్లదే గగనతలంబున లోకానుగ్రహమూర్తియై చంద్రుఁడు వెలుంగుచున్నాఁడు. ఈ సమయంబున నే లోని కరిగెదనుగాక.

(యవనిక.)

---

## ద్వితీయరంగము—రాజవీధి.

(ఆంజనేయుఁడు ప్రవేశము.)

(నేపథ్యమునఁ గలకలము)

ఓహో! దుర్గరక్షకులారా! ప్రళయ పర్జన్య గర్జానుకారియయిన నిర్ఘోషం బొకటి ప్రాగ్భాగమున వినవచ్చుచున్నది. మేల్కొనుఁడు! మేల్కొనుఁడు!

ఆం— ఘోర రాక్షస మాయలకు వెనుదీయక పగతుల కృత్రిమములకు జంకక, భూబిలంబులు కొండలు గుహలు గడచి సముద్రముదాఁటి, యెంతయో కోర్కెఁ బెంచుకొని వచ్చినందుల కిందేమి ఫలం బనుభవించితిని. సంపాతియు సీతామహాదేవి లంకయందున్నదని వాక్రుచ్చెఁగాదె? త దాదేశమున నీ దానవపట్టణమున నా వెదకని స్థలంబులేదు. వెదకిన స్థలంబుల దేవిజాడ కానరాదు. ఒకవేళ—

సీ. ఉడువీథిఁ బఱతేర ♦ సుడివడి ధైర్యంబు
దూలనంభోనిధి ♦ వ్రాలెనేమొ?
అకట! దానవకృత ♦ నికృతిజాలములకు
జడిసినిస్పృహావృత్తి ♦ గెడసెనేమొ?
కుమతిరావణుని ప ♦ ల్కులకు నీర్ష్యవహించి
సుదతి ప్రజ్వలితాగ్నిఁ ♦ జొచ్చెనేమొ?
పతిఁబాసి యేకాంత ♦ గతినున్కి కడుదూష్య
మంచుఁబ్రాణములఁ ద్య ♦ జించెనేమొ?
తే. గీ. మించుకిన్క నసురులు భ ♦ క్షించిరేమొ?
దానవాధీశుఁ డెందైన ♦ దాఁచెనేమొ?
కడకు సీతనుగాంచు భా ♦ గ్యంబు నాకుఁ
గలుగునో! కలుగదో? నో ♦ ముల ఫలంబు.

ఇదిగాక సుగ్రీవాది ప్రియజనంబులతోఁ గార్యసాఫల్య మొనర్చుకొని వచ్చెదనని శపథంబులు బలికితి. నా శపథంబులు వితథంబులు గాకుండు నుపాయమేది? సీతా మహాదేవి నాకుఁ గన్పించుట దుర్ఘటము. (ఆలోచించి) అయ్యో!

అట్లయిన, నాఁడు సకలసైనికుల సమక్షమున నాశ్రీరాముఁడు నన్నధికముగఁ బ్రేమించి పుత్తెంచునపుడు,

ఉ. రమ్మని చేరఁదీసి, సుత ♦ రమ్ముగ సీతనుమాకుఁ గూర్చ్చ భా
రమ్మును దీర్చుదీవని, ♦ కరమ్ము ప్రియోక్తుల నాదరించి, నే
మమ్మగు నంచుఁజెప్పి, మును ♦ మాదెసఁ జూపినయట్టి ప్రేమయుం
వమ్మయిపోదె? నాదగుభ ♦ వమ్మును వ్యర్థముగాదె? చూడఁగన్.

అయిన నంతటి ప్రేమకుఁ గృతజ్ఞుఁడనై సముచిత రామకార్య నిర్వాహక పరాయత్త చిత్తుండనై కంటినో? నిరాయత్తుండనై యుంటినో? దైవమెఱుంగు. సీతామాత స్థితిగతులనైన నివేదించువారీయూర నొక్కరు లేరు. ఇచటనాకెదటను శత్రుపక్షము వారు. ఇట్లుండ నెట్లు వెదకుదును? ఒకవేళ నామహాదేవి మేనఁ బ్రాణములు ధరించియుండెనేని, యీతరుణమునఁ గాకున్న నిఁకఁగొంత కాలమునకైనను (కోపముతో) లేక రావణు నిర్మూలించియైనను నాకార్యంబు సంఘటించుకొనియెదఁ గాని, యామె భయంకరులగు రాక్షసుల సమక్షమునఁ బ్రాణములు వాసి యుండెనేని, రాముని చెంత నెట్టివృత్తాంతమువిన్నవింతును?

తే. గీ. వాడుబాఱినయట్టి పు ♦ ష్పమ్ముపోలె
మున్నుగాఁ బ్రాణములు వాయు ♦ నున్నయతఁడు
అశని పాతంబుఁబోలు వృ ♦ త్తాంతమునకు
నేల వ్రాలఁడె? ధైర్యంబు ♦ దూలవిడిచి.

కావున రాముల సన్నిధికిఁ బోఁజాల. మఱియు

కం. ధరణిజఁ బొడఁగాననిచో
శరధింబడి విడుతు నొడలు ♦ శాతకరాళ
స్ఫురితాసిధారఁ జచ్చెద
విరాగమతి నగ్నిశిఖల ♦ వ్రేల్చెదమేనున్.

ఓ జగద్బాంధవులారా! మహర్షులారా! మీసర్వజ్ఞత్వము సఫలతఁ బొందమామహాదేవి వృత్తాంతము నాకెఱింగింపనినాఁడు లోకకంటకుఁడనై మిమ్ములయించెద. లేదేని నిశ్చింతంబుగఁ బ్రాణములు వాసెద. ఇద్దనిక్కము (ఆలోచించి) హా! ఏమిట్లనుచున్నాఁనుడ! నేనిప్పుడు జగద్ధిత కార్యము బూని వచ్చినాఁడను. ఇట్టినాపనికై సర్వసుపర్వగణంబులును జగచ్చక్షులును సాయపడ మందుదురని యాకాల ప్రళయంబుగ నీబ్రహ్మాండ గర్భాన్వేదన మొనరించి వేల్పుల సంహారించి, లోకంబుల్లలనాడించి సమూలముగ నీలంక నెత్తుకొనిపోయి,

రాముల పాదముల కడ నుంచువాఁడ. ఇందు నాకసాధ్య మేది? అయిన నింకలంక యం దన్వేషింపఁ దగిన స్థల మొక్కటిమాత్రమె కలదచటి కరిగెదఁ గాక.

(యవనిక)

---

(తృతీయరంగము—అశోకవనము)

(చంద్రుకలు విరియఁబోసికొని శోకతప్తయగుసీత కూర్చుండి యుండ, త్రిజట, వికట, లలాటాక్షి, దీర్ఘజిహ్వయుఁ బరివేష్టించి ప్రవేశింతురు.)

(లోపల ధ్వన్యనుకరణము)

సీ. అతికృశాంగిని, మా మ ♦ హాదేవి నెఱుఁగరే?
పరహితకరులార! ♦ పౌరులార!
భువనైకమాతను ♦ భూజాత నరయరే?
పరిణత వర్తులార! ♦ పౌరులార!
స్తుతనాము, రఘురాము ♦ సుదతినిఁ జూడరే?
పరివిమలగుణులార! ♦ పౌరులార!
భీతయై పలవించు ♦ సీతనుగానరే?
వరదయా కరులార! ♦ పౌరులార!

తే. గీ. ధన్యులార! సుశీలతా♦మాన్యులార!
వేల్పులార! దర్పోద్ధతా ♦ నల్పులార!
దాసుఁడను పదివేలవం ♦ దనము లివిగో!
రారె! కరుణించి తోడ్పడ ♦ రారె!యిందు.

సీత—(వినుటనభినయించి) ఆశ్చర్యమాశ్చర్యము. శ్రోత్రానందకరమైనధ్వని నాకిప్పుడు వినవచ్చుచున్నది. శాత్రవపట్టణమున నిట్టి యానందదాయక వాక్యముల నుచ్చరించు వారెవరు? జగత్ప్రియాభిరాముఁడు నారాముఁ డిందెందున్న వాఁడు? విధాత కితనస్వభావుఁడుకదా! నాయునికి నెఱింగించి వారి నిటకుఁ గొనితెచ్చిన వారెవరు? మున్నూటవులఁగడచి మహార్ణవముదాఁటి యీదుష్టుని పురంబుఁ బ్రవేశింపఁగలిగిరా? వారిప్పు డేస్థలమున దుఃఖించుచున్నారో? అకటా! దారుణాటవీ మధ్యమున మఱందిమాటఁ ద్యజించిన కఠోరహృదయినగు నాకు, వారి యొడఁ జాలికలుగనేల? హా! విధీ! లేఁతవయసున సర్వక్షందనాది సౌఖ్యముల విసర్జించి వచ్చిన లక్ష్మణుఁ డెట్లు దినములు గడపుచున్నాఁడో? అతని ముఖము మున్నటి యట్లున్నదో లేదో? నిష్కలుష స్వభావుని, కపటమున నెట్టిదో

యెఱుఁగని వానిని, నిర్జన ప్రదేశమున ననరాని మాటలాడి దుఃఖింపఁ జేసిన నా కతనిపై నేఁడు మాత్ర మెక్కుడిదయ? ఓ జనకరాజకుమారీ! నీ వినాశమును నీవే చేసికొంటివి. కాదేని నాఁడట్లు విడిచిచనలేక నీపాదములపైఁబడి భోరున నేడ్చుచున్న లక్ష్మణు నూరక చూచుచుందువా? అయ్యో! యెంతగతిపట్టినది? లక్ష్మణా! నీమాటలు వినియుండిన నిన్నికష్టములు కలుగవుకదా? సౌమిత్రీ! నీహృదయ మెంతనొచ్చెనో? నీసౌజన్య స్వభావ మెఱుఁగక నిష్ఠురము లాడితి. ఆడితి నననేల? తత్ఫలం బనుభవించితి. సాధుస్వభావుల మనసు నొప్పించిన కష్టాత్ములు యాతనలఁ గూలకుందురా? సౌమిత్రీ! మీ యన్న మృగముచేఁ జిక్కె ననెడి కోపావేశమున నోడలుమఱచి దూషించితి. ఆదూషణవాక్యములు నీమనసున నుంచియుండవు. కాని నిన్ను నొప్పించిన యావాక్యములు తలంచినపుడెల్ల నాహృదయము శతధా దళిత మగుచున్నది. ఇఁక నామని నంతకాలము నన్నుదహించుచునే యుండును. లక్ష్మణా! నీవు మఱల నాచెంతఁ బ్రియవాక్యము లాడుచుండ నేఁజూడఁగలనా? అది దుర్ఘటము. ఏలయన ?

మ॥ వనరాజ్యంబును వేఁడి, సంపదలుసర్వస్వమ్ము వోవీడి, మా
వెనువెంటన్ జనుదెంచి మించిన, కృపావిఖ్యాతచేతస్కు, నిన్
జనితామర్షమునన్ గఠోరముగ వేసారించు చండాలినిన్—
ఘనపాపిష్ఠిని— నన్నుఁ జూడఁగ మదిన్ గాంక్షింతువే? క్రమ్మఱన్.

లక్ష్మణా! అవియుక్తాయుక్త జ్ఞానము పోఁదసూపనీని కోపసమయమున నాడిన మాటలని నీవెఱుంగకుందువా? రామా! నీదయాస్వభావ మిప్పుడెట్లు మాఱెను! పరునియావాసమున జీవములతోనున్న యామలిన హృదయ నిఁకఁ జూడనని శపథ మూనితివా? అయ్యో! కఠోర హృదయుఁడగు రావణునిచేఁ గొంపోఁబడునపుడు, సమున్నతమగు పర్వతముపైఁ గొందఱుదయామయులు మెలంగుటఁగని, నానాథునకెవ్వరైనఁ దెలియఁజేసెద రను కోరికచే, నాభూషణము లందువిడిచి వచ్చితి. అవియైన నీచేఁ జిక్కియుండవా? నావిధ మెఱింగియుండవా? లేకున్న సూర్యవాకర నిశాచరులారా! నాశోక వృత్తాంతము మీరైన నానాథునకుఁ దెలియఁజేసియుండరా? మీకసాధ్య మేమియున్నది? అయ్యో! నిరాశ్రయుల కాశ్రయ మిచ్చి తోడ్పడువా రెవరు?

(ఆంజనేయుఁడు తెరచాటుననుండి)

(స్వగతము) అల్లదే! యాదివ్యతరు నికటమునఁ బత్నుల యాక్రందన ధ్వను లేమియు వినవచ్చుటలేదు. ఆస్థలంబును జనాకీర్ణస్థానంబట్లు గన్పట్టుచున్నది. పోయి చూచెదఁగాక (నడిచి) ఏమిచిత్రము! ఈస్థలంబుఁ దరియఁజేరినంత నుండి నాహృదయం బంతకంతకు నుత్సాహపూరితం బగుచున్నది. ఇదియంతయు నాకు శుభాన్వితముగా నున్నది. (మఱలఁగొంతదవ్వరిగి) భయంకరులును

గర్కశహృదయులను నగు స్త్రీలు తన్నుఁబరివేష్టింపఁ వనదేవతఁబోలెఁగన్పట్టు చున్న యామెయెవ్వరోకదా?

తే॥ గీ॥ శిథిలమై మలినంబైన ♦ చీరఁగట్టి
నొసఁటిధూళియె బూదిగా ♦ నెసకమెసఁగ
నువిద దీర్ఘకృశాంగి ♦ యయ్యును సముజ్వ
లాంగియై యున్నయది క్షమా ♦ లలితగతుల.

ఆతరువునీడ నిట్లు పరమయోగినివిధంబున నొకస్త్రీ దృగ్గోచర మగుచున్నది. అయ్యో! పరిపూర్ణ శాంతమయ యగు నీమెయెడల భాగ్యము వైరము బూనెఁ గాఁబోలు. ప్రాపంచిక ధర్మ మెంత తలక్రిందులుగనున్నది?

తే॥ గీ॥ ఖలులె సుఖముగఁ గాలంబుఁ ♦ గడపుచుండ
సగుణులకుఁబెక్కు లాపదల్ ♦ సంభవించుఁ
గాకములు స్వేచ్ఛమైఁ దిరు ♦ గాడుచుండ
శుకములే బంధమునఁ బడి ♦ సొక్కునట్లు.

అయిన నిక్కం బరయుదుఁగాక. (చూచి) ఈమానవీయుగాలు రామధర్మపత్నియే యైయుండునా? కాదేని,

తే॥ గీ॥ అవనీపతి పల్కినట్టి చి ♦ హ్నంబులెల్ల
నతివ నిజదేహమునఁ గాన ♦ నయ్యె, నౌర!
ప్రజ్వలిత శిరోమణియు జీ ♦ ర్ణాంబరమును
నతి కృశముఖంబు; నొరుల కీ ♦ గతులు గలవె?

కావున రామునిచే నేను వినిన లక్షణములన్నియు నీమెయందున్నవి.

మ॥ తొలి నేఁజేసిన భాగధేయము రహిన్ ♦ దోడ్తోఫలంబంద, వి
హ్వల చిత్తంబునఁ గార్యమొందిన ధరా ♦ ధ్యక్షుండుహర్షింప, నె
చ్చెలులిర్వంకల నమ్రపూర్వక వచ ♦ శ్రీ నన్నుఁగీర్తింపఁగన్
భళిరే! కంటినిఁ గంటి నీయవనిజన్ ♦ గామ్యార్థసంసిద్ధిగన్.

ఓహృదయమా! నీకిప్పుడు విశ్రాంతికలిగినది. నాకార్యసాఫల్య మొనర్చుకొంటిని. బహుకాల తపఃఫలము నేడుగంటిని. ఈమెతో నిప్పుడే సంభాషింతునా? కాదు, కాదు. ఈమె యిప్పుడు రాక్షసాంగనా పరివృతయై యుంటచే నిది యదను గాదు. అల్లదే యెదుర ఘోరస్వరూపుఁడగు నిక్కనుఁ డొక్కఁడీ దెస కే వచ్చువాఁడు. ఇప్పటికే మఱుఁగు పడెదను గాక.

(రావణుఁడు భయంకరాకారమునఁ బ్రవేశించును. అందఱును నిలు చుందురు. సీత కూర్చుండి యుండును.)

రావ—సీ. త్రిదశాధిపులనెల్ల ♦ నదలించి బెదరించి
యాలమందలయట్లు ♦ దోలినాఁడఁ
దలమెత్తనీక గం ♦ ధర్వ యూథంబులఁ
బఱచి దోమలయట్లు ♦ జఱచినాఁడ
జడదారిముచ్చులె ♦ య్యెడఁ బొడసూపకఁ
జెలఁగి నిర్మూలంబుఁ ♦ జేసినాఁడఁ
బ్రాణభీతిని గుహల్ ♦ బ్రాఁకెడి
దేవతా సీమంతినులఁ బట్టి ♦ చెఱచినాఁడ
తే॥ గీ॥ కిన్నరుల భస్మపటలిగాఁ ♦ దన్నినాఁడ
నెదురుగానని భుజశక్తి ♦ నెనసినాఁడ
మనుజ మాత్రులనిఁక నేల ♦ మాద్రిగానఁగ
నోర! యెంతైన నాకసా ♦ ధ్యంబు గలదె?

వీరరణ విహారంబు సలిపి శ్రమఁ జెందిన నేను, మనః ప్రమోదంబు కొఱకు సమయ సందర్భ పదగుంభిత గంభీర నిరూఢిం దనరు నీమెవాక్యామృత మొక్కసారి తనివిదీఱఁ గర్ణాంజలులం గ్రోలెదగాక, (చేరఁబోయి) ఓ జనక రాజపుత్రీ!

(సీత భీతయై యెడఁ గలుగఁ బోవును.)

రా—ఆహా! మఱుగుపడుట కిది క్రొత్త కాదు.

తే॥ గీ॥ దండకాటవి నుండి యు ♦ ద్దండవృత్తిఁ
జెంతసడుకొని యీలంకఁ ♦ జేరునాఁడు
కూర్మి నీదేహమును గనుం ♦ గొనఁగలేదె?
యట్టితఱిరాణివాస మెం ♦ దణఁగి యుండె?

సీ—(స్వ) అకటకటా! ఏమి యీ దుష్టవాక్యములు.

రా—కావున నో భువన మోహినీ! రాణివాసంపు చాకచక్యము లిఁకమానుము. సంకుచితములగు కృపా వీక్షణముల నాపైఁ బఱపుము. చిరకాల మీరీతి మేను గృశింపఁ జేయుటచే నేమేలును గలుగఁబోదు. ఇదిగాక బహు ప్రయాసముచె నిన్నిటకుఁ గోరితెచ్చినందుల కేమి ఫలము?

సీ—(స్వ) ఓసీ! దుష్టమానసీ సీతా! నీ జనకుని చెంతనైన నిలిచి విన్నప మొనర్చి యుండని నీవు నేఁడిట్లు పరునియెదుర నిర్భయంబుగఁ బలుక నెంచు నంతటి ధూర్తవైతివిగా! ఛీ! నీవారిని నీ వంశమును బాపభూయిష్టముగ నొనర్చిననీవు

ప్రాణములనేల భరింపవలెను? (యోజించి) అయ్యో! కాలమిట్టి మార్పుల దెచ్చిపెట్టినది, అయినను కులాంగనలు పరులతో నర్మభాష లాడఁగూడదు; గాని ఇతని హృదయ నిర్భేదన మొనర్చుటకు సంభాషించినను దోషముండదు. (ప్రకాశము) అయ్యా! బహుప్రయాసముచే మృత్యువును గోరి తెచ్చుటయే ఫలము.

రా—ఏమి! త్రిలోక విజయుఁడనగు నాకు మృత్యు వెక్కడ నున్నది?

సీత— సర్వదా నీచెంతనే యున్నది.

రా— (హాస్యముగ) లంకాధీశుని బలమెఱుంగవు కావుననే నీవిట్లు పల్కుచుంటివి. అది యట్లుండనిమ్ము. నీవు నన్ను జేకొననినాఁడు బల్మిమై సాధింప నెంచినచో నీవబలవుకదా?

సీత—అమలిన స్వభావముచేత నేను సబలను.

రా—అయిన నిప్పుడిందుల కేమందువు ?

సీత—సీత నీవశమగు ననుమాట త్రికరణశుద్ధిగ మఱచిపొమ్మని.

రా—(స్వ) సహజప్రాతివ్రత్యమీమెకుఁ గలుగకపోలేదు. దీనికిఁదగిన ప్రత్యుత్తర మిచ్చినది.

రా—ఛీ! ఛీ! నేనెంత దయాస్వభావమున నుపలాలించిన నీగర్వ మంతంతకు మితి మీఱుచున్నది. నాప్రార్థనంబంగీకరింపనిది నిజమేని మదీయంబగు చంద్రహాస వాలంబున కాహుతియిచ్చుట నిక్కమని తలంపుము.

సీత—నీదుష్టప్రలాపంబులకు బెదరుటకు నేతును క్షత్రియకాంతనే కాన నిటువినుము.

తే. గీ. చండదీప్తులవీడి మా ♦ ర్తాండుఁ డిపుడు
చల్లవడుఁగాక భువనముల్ ♦ సమయుఁగాక
కాలగతి తాఱు మాఱయి ♦ కాల్చుఁగాక
సీత వశమగునే నీకు? ♦ జెనఁటివినుము.

ఇదిగాక మనోవాక్కాయ కర్మంబుల నాథుఁడే దైవంబని నమ్మి కొలుచు చున్న నన్నకారణముగఁ దెచ్చి, సహింపరాని వేదనలం బెట్టితివి; కాన నా ప్రాణనాథుని వలన రణావని సబాంధవముగ నిన్నుఁ జంపించి, మీకులాంగన లెల్ల పలువిధంబుల మీకై వాపోవుచుండఁ జూచుచు నయోధ్యఁజేరుదాన. కావున సర్వముఁ దెలిసి చావున కియ్యకోకుము.

రా—సాధ్వీ! అంతఃపుర మేడలందు మృదుశయ్యలపై నధివసించి సౌఖ్యముగ నోలంగు రాణివాస స్త్రీలు యుద్ధభూమింగల తారతమ్యములు శాత్రవుల బలపరాక్రమాది గుణంబు లెట్లెఱుఁగఁగలరు? నీప్రాణేశుఁ డీలంకఁ బ్రవేశించి నిన్నుఁ గొనిపోవునని కదా వచించితివి ?

సీ. గమననిరోధంబుఁ ♦ గావించి మితిమీఱు
జలధిలంఘించి యే ♦ సరణివచ్చు?

వచ్చెంబో, గజ,భటా, ♦ వలి రక్షితంబైన
దుర్గమెట్టులఁజొచ్చి ♦ నిర్గమించు?
నిర్గమించినయేని, ♦ నిజసైన్య పటలంబుఁ
గడచి నాతోఁబోరఁ ♦ గడఁగు నెట్లు?
పోరభస్మంబయి ♦ పోక వీఁకఁ దలిర్పఁ
గలన నిర్భీతుఁడై ♦ నిలుచు నెట్లు?
తే. గీ. నిశిచరుల చెంత మనుజులు ♦ నిలువఁగలరె?
సింగముల దాఁకి లేళ్ళు పై ♦ నంగు నెట్లు?
రాముఁడెక్కడ? విజితసు ♦ త్రాముఁడేడ?
తరుణి! యంతరమింతయుఁ ♦ దలఁపవలదె?

రాజ్యముఁ గోల్పోయి, తినుట కాహారమైనను గానని వాఁడు, నా చతురంగబలములను నన్ను నుగెలిచి, నిన్నుఁ గొనిపోవు నెట్లు? ఒక వేళ నీ నాథుని ధైర్యశాలియని తలంతు వేని,

తే.గీ. మనుజు లేడ? రాక్షసమహా ♦ మాయ లేడ?
గగన పుష్పంబు నీదగు ♦ కామితంబు
తగ మరీచికా జలములు ♦ తలఁపులెల్ల
నిట్టి యడియాసలేల? చే ♦ పట్టు బాల!

సీత——కట్టా! శ్రీరాముని దుర్బలునిగా భావించితివి. అతని శౌర్యం బిపుడె తెల్లంబు పడును, కాని

సీ॥ చెలరేఁగి సైనికా ♦ వలి కోటగవనుల
ద్రుంచి పురంబు భే ♦ దించునాఁడు,
లంకాపురంబెల్ల ♦ లయ మహాగ్నిచేఁ
బెల్లుగ దివిఁబ్రజ్వ ♦ రిల్లునాఁడు,
తనయుల నెడఁబాసి ♦ జననులదిగఁద్రోసి
భటులెల్లదిశలకుఁ ♦ బాఱునాఁడు
రణభూమి సమసిన ♦ రాక్షసవరులకై
కులకామినులు మదిఁ ♦ గుందునాఁడు,
తే. గీ.॥ తరుణి నీయురస్థలమునఁ ♦ బొరలునాఁడు,
పదితలలు జీర్ణమై నేలఁ ♦ బడెడునాఁడు,

పీఁక రాము నెఱింగెదు ♦ గాక, నేఁడు
తెలయవచ్చునె? రాక్షస ♦ కులవినాశ!

ముందు రానున్న తీవ్రవేదన లించుకైన నెఱుంగక మితిమీఱి యుబ్బుచుంటివి.

రావ—(సరోషముగ) ఓసీ! గర్వోన్మత్తప్రలాపినీ! ప్రత్యర్థి ప్రతాప దీప నిర్వాపణ ప్రభంజనుం డగు సురభంజనుండు హీనమానవునిచేఁ జచ్చునా? కొలందికిమీఱి పల్కు నిన్నిఁక సహింపఁగూడదు. ఇదే మదీయంబగు శాతఖడ్గము చేఁ ఖండించి చెండాడువాఁడ. (అని మీద నుఱుకఁబోవును.)

మండోదరి—(వారించి) నాథా! ఏలయింతటి సాహసము?

తే.గీ. కఱఁటిశత్రులఁ దెగ టార్చు ♦ ఖడ్గ మహహా!
పడఁతిపయి నుగ్రవృత్తిని ♦ విడువఁ దగునె?
కుధరముల గీఁ టడంచెడు ♦ కులిశధార
సులలితములగు విరులపైఁ ♦ జొనుపునట్లు.

అబలను సంహరించుట దుర్ఘటముగాదు. సహింపుము. ఈమె నీకిప్పు డేయపరాధం బొనర్చినది? స్త్రీహత్య యనర్థమూలము.

రావ—దేవీ! నీప్రార్థనకై యిప్పటికి సహించితి. నీ ప్రాణమిడిల్లుము. రాక్షసాంగనలారా! ఈ రాజపుత్రిని సామ దాన భేద దండోపాయములం జక్కసాంచి యెట్టులైన నాకు వశవర్తినిఁగఁ జేయు భారము మీయది జాగ్రత్త. సమణీ! యిఁక పోదము రమ్ము. (నిష్క్రమింతురు.)

ఆం—(స్వ) అకటా! ఎంతటిదుర్దశ? కంటక పరివృతమగు మాలతీ పుష్పంబుంబోలె నీసాధ్వి దానవులచెంత కడుంగడు నిడుమల బడుచున్నను జూచి యూరకుండవలసి వచ్చెఁగదా? సూర్యవంశమునకు గర్భశత్రువులగు నీ దానవులఁ జూచినంతనే నెట్లు శాంతమువహింతును? పతివ్రత తాపహరణ కరణ సమాగత మహోయాతనా పరిగ్రస్తంబగు రక్షస్సమూహంబుపయి కుఱికి మారిమసంగినట్లు కలంచి చెండాడక క్షమించుటెట్లు? క్షమింపకపోయిన, రామాజ్ఞ నాకంతవఱకు లేదుకదా! తదీయ వచశ్శృంఖలములు నాభుజదండములం గట్టివైచి హీనసత్త్వునట్లు జేసినవి. ఎట్లయినను గానిమ్ము. నేనిపుడు శాంతముతోఁ గార్యము నిర్వహించుకొననలయు. దానవాంగన లించుక తొలఁగినంత నే నీ దేవి నూఱడించెద,

త్రి—సీతా! నీవిఁకఁ బెక్కేండ్లు శుష్కించినను రాముఁడిందుల కేతెంచి నీచెఱ విడిపించుట దుర్లభము. వృథాప్రయాసతేల? తేజోవంతుఁడగు క్రొత్తవరునిఁ గోరికొనుము. అపుడే యైశ్వర్యమున కధికారిణి వగుదువు. జగద్ధేయలగు కాంతలెందఱు తమ్ముఁగోరిన పురుషుల కామితం బీడేర్పలేదు? హీనుఁడగు రామునిఁ ద్యజించుటయే మేలు.

వికట—సాధ్వీమణులు కష్టదశననుభవించునపుడు తనప్రాణమైన నర్పించి రక్షించువాఁడును - ఆపదలయందును విడనాడక ననువర్తించువాఁడును - తనళక్తికొలంది

భోగభాగ్యంబు లొనఁగూర్చి భరించువాఁడును భర్తయనంబడును గదా? ఏడీ! ఇన్నిఁటిలో నీప్రాణనాథుఁడు నీ కేసుఖ మొనఁగూర్చినాఁడు? స్వోదరమాత్ర మే పూరించుకొను శక్తిలేక, కాననమునఁబడి యెట్లో బ్రతుకుచున్నాఁడు. పరుఁడు నిన్ను గొనివచ్చి యంతఃపురమున నిడికొనియున్నను, విడిపించుకొను శక్తిలేక మొగముఁ ద్రిప్పుకొని యున్నాఁడు. ఇట్టిభర్త నాశించి నీవేసౌఖ్య మను భవించెదవు? నీనాథున కే శక్తియున్న నింతకుమున్నే వచ్చి నిను గొనిపోవక యుండునా? మాహిత మంగీకరింపుము. దానవేంద్రుని గైకొందువేని యా జన్మాంతరము సుఖించెదవు. రక్షోరాజ్యంబునకు నీవే రాణివగుదువు.

దీర్ఘ — సీతా! నీమగఁడును మఱందియు సహజదుర్బలులుకదా? అట్టివారు సముద్రము లంఘించి యీవల కెట్లువత్తురు? ఇఁక నీ వీకోరికలుంచుకొనకుము. ఒకవేళ నీవే ప్రేమభరమున నీనాథునిపంచఁ జేరినను రావణుఁడు చెఱయం దిన్నినాళ్లుంచు కొనినకతమున రాముఁడు మున్నటియట్ల నిన్నాదరింపఁడు. తెగినదారమును ముడివేసినను మున్నటియ ట్లతుకుకొననేరనట్లు, హృదయములు వేఱయి యుం డును; కావున నిన్నుఁజూచినఁ గినియుచు పరివారిలో నీమగఁడు నిన్నగౌరవ పఱచుచుండఁ దక్కుంగల బంధుజనంబులు గడ్డిపోఁచనుగాఁ బరిగణింతురు. భర్తచేఁ దిరస్కరింపఁబడిన కాంత నెవ్వరును లక్ష్యముసేయరు. ఆశ్రయ విహీనమైనతీఁగ యాశ్రయాంతర మన్వేషించునట్లు రావణు నాశ్రయింతువేని సుఖింతువు. ఇష్టములేని మగనికిఁ గాపురము సేయుట కష్టము, కాన నపుడు చెట్టుగట్టుపాలు గావలసివచ్చును. ఈ కష్టములకంటె మాహిత మంగీకరింతువేని రావణుని పట్టపుదేవివై, చీనిచీనాంబరములుగట్టి, యనర్ఘ్యమణిభూష లలంక రించి, పరిచారికా సహస్రంబులచే సేవలు గొనుచు బ్రతికినన్నాళ్లు సుఖింతువు. సిరిరా మోకాలొడ్డువా రుందురా? నీసుఖమునకై చెప్పెదు మామాట వినుము. మఱియు నహల్యయంతటి దేవియుఁ బరునిఁ గూడలేదా? ఆమె పరలోకమున కుఁగాక చెడెనా?

అం — ఏమి దీనివాచాలత్వము? మాయురే? గయ్యాళు లీవిధమునఁగదా యేమియు నెఱుంగని కులకాంతల మనంబులు విఱిచి యాలుమగల కెడబాటు గల్గింతురు?

సీ — దానవీ! సత్కులజాతులగు స్త్రీలకు మగఁడుదక్కఁ బ్రాణాధికంబగు దైవంబు వేఱొండుగలదా? మానవతియగు సతికిఁ బతికంటెఁ బ్రమోదకరమైన వస్తువెద్ది కలదు? మఱియు —

సీ॥ బ్రతికినన్నాళ్ళు నిక్క ♦ బాయలేనని తోల్తఁ
బ్రకటించి రక్షించుఁ ♦ బ్రాణవిభుఁడు
అవమానమును బొందు ♦ నవసరంబునఁ దన
ప్రాణమైన నొసంగుఁ ♦ బ్రాణవిభుఁడు

సౌఖ్యదుఃఖములకు ♦ సమముగా నేవేళఁ
బాయకవర్తించుఁ ♦ బ్రాణవిభుఁడు
కోరినకోర్కులఁ ♦ గూరిచి దేహ స
ర్వస్వమ్ము నర్పించుఁ ♦ బ్రాణవిభుఁడు
తే॥గీ॥ కాన నాథానుసారిణి ♦ యైన సతికిఁ
బతిని మఱపించు వేఱు స♦ద్గతియుఁగలదె?
ఇంటఁ గల్పముగల్గ దు ♦ ష్కంటకముల
నొరుల వేఁడఁగఁ బోయెడు ♦ తరుణి కలదె?
మెండియు మీరిప్పుడు పల్కిన వినశ్వరములగు సంపద లెన్నియున్నను,
సీ॥ పతిసేవచే మేను ♦ బడలింపనోపని
పడఁతిదాల్చిన దేహ ♦ పటిమయేల?
మగనిసౌఖ్యంబు నె ♦ మ్మదిఁజింత సేయని
చెలి పారమార్థిక ♦ చింత యేల?
భర్తదైవంబుగా ♦ భావింపనోపని
భామనోచిననోము ♦ ఫలము దేల?
హృదయేశుచిత్తంబు ♦ నెఱిఁగినటింపని
సతివిచక్షణతా ని♦యతుల వేల?
తే॥గీ॥ నాథునలరింపలేని సౌం ♦ దర్య మేల?
విభుఁబ్రిసన్నునిఁ జేయని ♦ విద్య యేల?
కాంతుఁడెడఁగాఁగఁ గూడిన ♦ కలిమియేల?
జీవితేశ్వరునకుఁగాని ♦ జీవమేల?
కావున ధనాది సంపదలు లేకున్నను
సీ॥ అతియసూయాత్మలౌ ♦ నత్తమామలనైన
గడుఁబ్రసన్నులఁ జేయు ♦ గడఁగునెద్ది?
దుష్టకాముక జనా ♦ కృష్టయౌ సమయానఁ
బడఁతికి దోర్బల ♦ మిడునదెద్ది?
దుష్కృతదోషముల్ ♦ దొలఁగించి నిజప్రాణ
నాథుని ముక్తికి ♦ నడపునెద్ది?

అన్యకాంతలచేత ♦ ననపహార్యంబయి
తులలేనిభూషమై ♦ వెలయునెద్ది?
తే॥గీ॥ ఇహపరంబులఁ బ్రియదంబు ♦ నిడునదెద్ది?
కష్టములనందనీయక ♦ కాఁచునెద్ది?
యల పతివ్రతాత్వమనెడి ♦ కలిమిగలుగ
నేల పెఱకల్మిలెన్నని ♦ గోలలకును?

ఒకవేళ భాగ్యదోషమున నువిద తన కనురూపుఁడగు వరునిఁ బడయఁజాలకప్పుడు

ఆ॥ వె॥ అంగహీనుఁడైన ♦ ననదయైనను మహా
బధిరుఁడైన ఘోర ♦ పాపియైన
సమధికుండెయైన ♦ షండుఁడైననుగాని
యువిదమగనిఁ బాయు ♦ టొప్పదండ్రు

కావునఁ బెక్కేండ్లు దుస్సహ దరిద్రాక్రాంతనై యున్నను దుస్సహములగు నాపదలెన్నేనిఁ బొడమినను జగత్త్రయాభిరాముఁడగు రఘురాముని దక్క నితరుల నాక్రేఁగంటనైనను జూడనోప. వ్యర్థముగ మీరేల ప్రయాసపడెదరు?

లలా—ఓసీ! యవినయభాషిణీ! పోఁగాలము దాఁపించినవారు హితోక్తులఁ గైకొందురా? దవాగ్నిలోఁ బడఁద్రోయునప్పుడైన మావాక్యములు వినెదువెమ్మ.

సీ—దానవీ! గభీర జలాశయమందలి స్వచ్ఛోదకమును నున్నతస్థలమునకుఁ ద్రిప్పఁ బ్రయత్నించుటంబోలె మీ ప్రయాసలు వ్యర్థమగును. నన్నిఁక మీ దుష్టవాక్యములచే బాధింపకుఁడు. నావలన నిఁకఁ గొలఁది దినములలోనే లంక రూపుమాయనున్నది. ఇంతలో నన్నేమిచేయ నిశ్చయించితిరో యట్లు గావింపవచ్చును.

త్రి—రాక్షసాంగనలారా! ఈ సీతా వాక్యంబులు నిక్కంబులేయని నాకును దోఁచుచున్నవి

ఏక—ఎందువలన నీవట్లూహించితివి?

త్రి—స్వప్నములు మృగతృష్ణా ప్రవాహములుగాని నిన్నటి నిశీథమున నేనొక కలఁగంటిని. అది ప్రత్యక్షానుభవ స్వరూపమైయుండెను. శ్యామలాంగుఁడగు నొకపురుషుఁడు భద్రగజము నధిష్ఠించి సీత తన యూరుతలమున వెలుంగ, సోదరసమేతుఁడై లంక వెడలిపోవఁ గంటి. మఱియు నంతఃపుర స్త్రీలు శోకాతురలై పర్విడ, రావణుఁడు రక్తాంబరములు గట్టి గార్దభము నెక్కి దక్షిణదిశ కేగఁ గనుఁగొంటి. ఈ స్వప్నము లంకా ప్రళయ సూచకముగఁ దోఁచుచున్నది. మన రావణుని యధర్మకృత్యంబుల వలన లంక కేమికీడు రానున్నదోకదా! మీ రీసీత నిఁక హింసింపకుఁడు. సాధ్వీనుల సంతపింపఁజేయుట మృత్యువును గోరి పిలుచుట యగును. ఇంకొక విశేషము; నాతోరండు; రహస్యముగ మీకుఁ దెలిపెదను. (నిష్క్రమింతురు.)

సీ—ఈ కంటక స్త్రీలించుక యెడఁగలుగఁ బోవుటయు క్షేమంబె. వీరి వాక్యంబులంబట్టి చూడ నానాథుఁడు సైన్యసమేతముగవచ్చి యీచెఱవిడిపించుననుటయుఁ గల్ల.

ఇఁక నేను జీవముతో నుండియు నేమి ప్రయోజనము? కఠినాత్ముఁడగు రావణుని హస్తములకుఁ బ్రాణము లర్పించుటకంటె స్వహస్తములతోఁ బ్రాణములు దీసికొని సుఖించెద. హా! భాగ్యమా! పదునాల్గేండ్లు వనవాసము నిర్వర్తించిన పిదప నయోధ్య జేరి, కౌసల్యాది మాతృజనముల కనులు చల్లఁగ, మగనితో రాజ్యభోగంబు లనుభవింతునని నమ్మియుంటినే? అట్టి యాసలెల్ల వమ్మయ్యె. మఱి నా నాథుఁ డయోధ్యయందుండఁ గాంచఁగలనా? వారతికష్టముగ నడవుల నిడుమలఁ బడుచుండంగ నే స్వర్గమున కేగవలసి వచ్చెను. భగవంతా! అపకీర్తికిలోనై యాత్మీయులఁ గోల్పోయి శత్రుజనమధ్యమున బలవన్మరణము నొందఁ జేసితివా? అయ్యో! సముద్రతరంగములట్లున్న నాబంధువర్గము ప్రాణాంతమందొక్కరైన నా చెంతనుండరాదా? ప్రాణములు మేను విడచిపోవునపుడు దుర్భరముగాకుండ నుపాయాంతరము బోధింపరాదా! ఓ శాంతాత్ములగు కౌసల్యాది యంతఃపురజనములారా!

తే.గీ॥ ఆపదోద్ధారకులు బంధు ♦ లగుట కతన
ననదనై పలవించు నీ ♦ యదను నందు
రారె! యొకసారి వీక్షించి ♦ పోరె! నాకు
గరళమైన నిడరె! దయా ♦ కలితమతిని॥

ఇందెందైన ఖడ్గమున్న నొక్కసారిగ ప్రాణములు దొఱఁగియుందును. ఇప్పుడు నాకట్టి సాయమొనర్చువారెవరు? అయ్యో! మాతృసమముగఁ దలంచుచుండిన నాకు అందఱికిఁ గళంకముఁ దెచ్చిపెట్టి పాపమున కొడిగట్టిన నాకు సుఖమరణమా? ఎక్కడిమాట? నా లక్ష్మణుని తుదిసారియైనఁ జూచుభాగ్యము నాకు లేదేమో? అకటా!

చం॥ వదినెయొనర్చినట్టి బల ♦ వత్తర గర్హణభాషణంబుఁదా
నెద సహియించి, కష్టముల ♦ కెంతయు నోర్చువహించి, రాజ్యసం
పదలఁ ద్యజించి, రాము పద ♦ పద్మములన్ భజియించి వెల్గు మా
సదమలమూర్తి లక్ష్మణు వి ♦ సన్నముఖంబిఁకఁ జూడఁగల్గునే?

ఇంకెక్కడి లక్ష్మణుఁడు? నా ప్రాణహత్యావృత్తాంతము విన్నంతనే మాయత్తలెంతపరితపింతురో! ప్రేమభరమున దివసత్రయమున కొక్కమాఱయోధ్యకేతెంచి కన్నులఁ జూచుచుండిన నాతండ్రి యీవార్తవిని యెంతపలవించునో గదా! అందఱన్ని విధముల నడలుచుండ నేను సుఖముగఁ బోయెదను. రామా! ఇదే కడసారి నీ సందర్శనభాగ్యము లభింపఁజేయుమా! నీకైన ధర్మపత్ని నిట్లు చీకాకు నొందింప న్యాయమా! స్వర్గసౌఖ్యమబ్బుకొఱకు నీపాదములంటునిమ్మా, మరణశయ్యపైనున్న నన్నుఁజూడ రాకుండు టుచితమా? హా! ఈ చండాలజాతి

కంత్యకాలమున నమ్మహాత్ముని దర్శన మెట్లు చేకూరు? ఓ సూర్యచంద్రులారా! ఈలోకముతోడి సంబంధము నాకుఁ దీఱినది. కానఁ గడసారి మిమ్ము మ్రొక్కి వేఁడెదను.

మ॥ నిజనాథుఁ గృపఁజూడరే! యతఁడు మ ♦ న్నింపంగఁ బెంపొందు భూ
ప్రజలన్ బ్రోవరే! సోదరత్రయిఁ గృపన్ ♦ బాలింపరే! రాజబం
ధుజనాళిన్ దయఁగావరే! యశమునన్ ♦ దోడ్తోడఁ గాపాడరే!
ద్విజరాజార్యములార! మీయశము సాం ♦ ద్రీభూతమై వర్ధిలన్॥

మఱియు దానవుల చేఁజిక్కినను నెంతటి కష్టదశననుభవించినను సీత తన సుశీలతనుమాత్రము గాపాడుకొని తుదకు లోకాంతరగతురాలయ్యెనని మన్నాథునకుఁ జెప్పుఁడు. నే నాత్మహత్యా దురిత సముపార్జనము సేయుచున్నదానను.

తల్లీ! భూదేవీ! నేను మరణించిన వెనుక సౌఖ్యకరమగు నీ గర్భమునన్నిడుకొనుము. మఱియు ప్రాణాపహరణ క్రియకు నా వెంట్రుకలే సాయపడెడుఁ గాక. (వెంట్రుకలు కంఠమునకు బిగియఁ గట్టి) హా! రామా! రామా! సెలవొసంగుము.

(ఆంజనేయుఁడు చెట్టునుండి లంఘించి ప్రవేశించుచున్నాఁడు.)

ఆంజ—ఓజగత్త్రయైక రక్షణా! భగవంతా, రక్షింపుము! రక్షింపుము!

మ॥ వినుమో మాత! నిజాశ్రితావనకృపా ♦ విఖ్యాత! వన్యాళిఁ బో
యనికూర్మిన్ భ్రమియించి, నీగతికి న ♦ త్యంతంబుదుఃఖించు రా
ముని నీప్రాణవిభున్ వియోగిక మహా ♦ మోహాబ్ధిలో ముంచి నీ
తనువున్ బాయుట మేలె? స్త్రీల కిది స ♦ ద్ధర్మంబె? చింతింపుమా!॥

సీ—(స్వగతము) ఏమి యాశ్చర్యము? మారుతము రామశబ్దసమ్మిశ్రమై యీదెస కేవీచుచున్నది.

ఆం—తల్లీ! ఇంతటిదృఢతర ప్రయత్నముఁ బూనుటేల?

ఉ॥ ఎంతటివారికైన నల ♦ యింపక తీరునె బ్రహ్మచెద్దయ మూ,
వంతవిపత్తు సంఘటిలి ♦ నంతనె సర్వమునున్ ద్యజించి, యొ
క్కింతయు నెక్కుముందుగన ♦ కిట్లు మఱల్చెడు వారు లేక, దు
ర్దాంత మహోబాద్యమంబెసఁగఁ ♦ బ్రాణమువాయఁగఁ జూతురే భువిన్?

ఓ కల్యాణీ! నీ కనుబాష్పములు ప్రపంచమున కరిష్టావహములు. మఱియు

తే॥గీ॥ సంతతానంద బాష్పసం ♦ జనితశుభద
లక్షణములైన నీదగు ♦ వీక్షణముల

శోక బాష్పమ్ము లురలగాఁ ♦ జూచియుకట?
యెవని కులమును దహియింప ♦ నెంచితమ్మ?

అమ్మా! పంచ ప్రాణములు నీవయని నమ్మియున్న యారఘురాముని యాశ లన్నియు భంగ మొనర్చి, మఱఁదిని బంధువర్గమును నైనఁ దలఁపక, యాత్మహత్య సేయునంతటిసహింపరాని కష్టము లిప్పుడేమి కల్గినవి? ఇదిగాక,

తే॥గీ॥ దాసదాసీ జనంబు ల ♦ త్తలును జనకుఁ
డాత్మవిభుఁడు రాజ్యంబు నీ ♦ కమరియుండ
సర్వమునుఁ రోసి యీ విదే ♦ శమున నకట!
ప్రాణములు వాయ నుద్యమ ♦ మూననేల?

తల్లీ! నా ప్రార్థనం బంగీకరించి ప్రాణహత్యోన్ముఖంబగు బుద్ధిని మఱల్పుము. ధైర్యమువహింపుము.

సీ— ఈ కృత్రిమ స్వరూపుఁ డెవరు? నా బంధువర్గముం దలఁపించుచు నన్నాఁడింప నేతెంచుటకేమి హేతువు? ఈ పరపురుషుఁ డీ నిర్జన ప్రదేశమున నాతో సంభాషింప నేలయపేక్షించెనో? ముందేమికీడు రానున్నదో! (యోజించి) మగనిని గోల్పోయి యాత్మగౌరవ మొరుల కర్పించి, పరునిచేఁ జిక్కిన నా కింతకంటె దుర్భరమగు కీడు లెవ్వికలవు? ఈ కపటవృత్త మెఱిఁగెదఁగాక. (ప్రకాశముగా) ఓ దయామయా! కష్టనివృత్తికొరకు మరణమే కారణమని యొనరించు నన్నీ పుణ్య కార్యమునుండి మఱల్పుటచేత నీకేమి మేలు గలిగినది?

ఆం— ఇందుమూలమున లోకోపకారంబు సల్పిన వాఁడనైనాను.

సీ— నేను రాక్షసలోక ద్రోహినిగదా! ఇట్టి నన్ను రక్షించుట లోకోపకార మెట్లగును?

ఆం— అమ్మా! నీవు మాకు మాననీయు రాలవుగాని ద్రోహివిగావు.

స— అదేల? రక్కసులెన్నఁడిట్లాడి యుండలేదు.

ఆం— నేను రక్కసుఁడఁగాను.

సీ— మఱి కృత్రిమ రాక్షసుండవా?

ఆం— జననీ! కాదు. కాదు.

సీ— కాదేని నీవెవ్వఁడవు? ఎందులకిచ్చటికి వచ్చితివి?

ఆం— ప్రభుకార్యార్థమై వచ్చితిని. నేను మారుత పుత్త్రుఁడను.

సీ— క్షణక్షణంబును బెఱస్త్రీలయెదుర నిట్లు మర్మ గర్భితముగఁ బల్కుమని పంపిన యాధర్మ పరావతారుఁడగు నీప్రభు వెవఁడో విన్నఁగోరెద.

ఆం— జననీ! సత్యము. సత్యము.

మ॥ జనముల్ ధర్మపరావతారుఁడని యే♦సన్మాన్యువర్ణింతురో? వ
ర్తనమున్, శౌచము, సత్యశీలపనము, ధీ♦రత్వంబునుం గాంచిన
న్మనుజుల్ హర్షముఁగాంతు, రా యినకులాం♦భోరాశి శుభ్రాంశుఁడే
ఘనుఁ డా రాముని బంటనో జనని! సౌ♦ఖ్యామోద సంధాయినీ!

సీ.—ఆహా! నిరంతరము నాకడ మీరొనర్చుచున్న కృత్రిమములేకదా యివి? నీవిప్పుడు రామనామోచ్చారణ మొనర్చి నన్ను వంచింపఁజూచుచుంటివి?

ఆం.— రామనామోచ్చారణ మాత్రమున నీమెయిట్లు శంకించుటకుఁ గారణమేమి? తావులఁ దప్పినపుడు విశ్వాసము సంశయాకృష్టమగుట నిజము.

తే॥ గీ॥ కాకిమూకలు నిరతంబుఁ ♦ గాఱులఱచు
రవము లాలించి, చెవులు గ ♦ ళ్లుపడియున్న
కోకిల, స్వకీయజనముల ♦ కూజితమొక
సారి వినియు, శంకించి వే ♦ సారుఁగాదె.

అమ్మా! నేనట్టి వంచన నెద్దియు నీకడఁ జూపలేదు.

సీ.— ఛీ! ఛీ! నీకపట స్వరూప మింకొకతూరి నాయెదురఁ జూపకుము. దూరముగఁ బొమ్ము.

ఆం.—(స్వగతము) ఏమి యాశ్చర్యము? అయ్యో! ఈమెకు నా స్వరూపమందే నమ్మకము లేనప్పు డింకేమని విన్నవించుకొందును? అత్యధిక ప్రయత్నమొనర్చి సీతను గనుఁగొంటినని సంతసముచేఁ జెలరేఁగుచుంటి. నాకదియు దూరమయ్యె. ఔరా! కాల వక్రతా ప్రకారము? మంచిది నేనింకొక్కసారి మనవియొనర్చెద. (ప్రకాశముగ) దేవీ నేను రాక్షసుఁడ గాను. కపటవేషముఁ బూనియు నిచటికి రాలేదు. నన్నేల విశ్వసింపవు?

సీ.—నిన్ను విశ్వసించువారు నీ తోడి రక్కసులె. నన్నిఁకఁ బ్రేరేఁపక పొమ్ము.

ఆం.—అయ్యో! సర్వము విపర్యస్తమైనది. ఇంకేది తెరవు? ఈ దృఢ నిశ్చయమును మరల్చువారెవరు? ఈమె తన సందేశము నాతోఁ జెప్ప నిష్టపడదేని,

సీ॥ దేవినారసి మదు ♦ క్తినిఁ జెప్పిరమ్మన్న
భర్తతోనేమని ♦ పల్కువాఁడ?
హర్షయే మాతల్లి? ♦ యనుచుఁ బల్కు సుమిత్రి
తనయున కేమని ♦ వినుచువాఁడ?
సీత సందేశంబుఁ ♦ జెప్పుమా! యను నాదు
విభున కేమని విన్న ♦ వించువాఁడ?
మహిపుత్రిఁ బొడఁగాంచి ♦ మరలితిననుటకుఁ
దార్క్షాణమెద్దానిఁ ♦ దలఁచువాఁడ

తే॥ గీ॥ మఱలఁ గిష్కింధ కేల్పఁగి ♦ మఱలువాఁడ?
సీత నెట్లు ప్రసన్నఁగాఁ ♦ జేయువాఁడ?
నాఁటినాకామితంబులు ♦ నాశమొందె
నేఁటి నాప్రయాసంబులు ♦ నీటఁగలసె.

అదృష్టహీనునకుఁ గార్యములు దగ్గరిఫలము సంగినట్లుండియు దూరమగుచుండును. ఇపుడీమె నెట్లు నాయెడఁ బ్రసన్నురాలుఁగాఁ జేసికొందును.

(స్వగతము) మంచిది. ఈమె నిక్కముగ రాక్షసమాయలకులోనై యిట్లు శంకించియుండునేని నన్ను విశ్వసించునట్లు ప్రబోధించెద. (ప్ర) అమ్మా! దుర్భర కష్టావస్థకుఁ దోడుగ నారూపము గాన్పించి నిన్నెక్కుడుగ సంకటపెట్టుటకు నేనిటకు రాలేదు. సుగ్రీవప్రేరితుఁడనై బహుప్రయాసలకోర్చి యిచ్చటకు వచ్చి నిన్ను దర్శించితిని. అయినను నీ సంకటముఁజూచి యిప్పుడేమియు నుపకృతి యొనర్పఁజాలను. నన్నన్యథా భావింపక కృపాదృష్టిఁజూడుము.

సీత—ఏమి చిత్రము! సంపెఁగ పరిమళమునకు భ్రమరసమూహంబుఁ బోలె రామనామమన్నఁ దలకింటగించుకొను పాపభూయిష్ఠులగు నీ దానవుల సమక్షమున నితఁడు ప్రతినిమేషము రామనామము స్మరించుచున్నవాఁడు (ప్రకా) అయ్యా! లంకావాసులకు రామనామ మెట్లలవడియె?

ఆం—నేను లంకావాసిని గాను.

సీత—మఱి నీవెచటనుండి వచ్చితివి?

ఆం—పుణ్యప్రశాంతమగు మాల్యవంతమునుండి.

సీత—(స్వగ) మాల్యవంతమనెడు శబ్దశ్రవణమునఁ గోరికలంకురించుచున్నవి. (ప్రకా) అయ్యా! ఇట్లనుటచేత నీవు నిష్కపటివనికదా సంబోధించెదవు?

ఆం—అమ్మా! ఇంకను నీకు నమ్మకము జనింపకున్న నే నేమందును?

తే. గీ. సదమలగుణుండు, లోకైక ♦ విదితయశుఁడు,
కపటజాల లతాపవి ♦ ఘాతకుండు
భవరహితుఁడైన రాముని ♦ బంటనగుటఁ
గపటమున కిమ్ము మాయెడఁ ♦ గలుగదనుము.

భూభారావతరణార్థమై కౌసల్యా గర్భంబున ధర్మస్వరూపమునొంది భువి నవతరించి యున్న యా రఘురాముని భృత్యులమగుట మేమెట్లధర్మ ప్రవర్తనుల మగుదుము?

సీత—(స్వగ) ధన్యము. ధన్యము. చిరకాలమునకు మహదానందకరమైన రామనామము మీ చెవులారవినఁగలిగితిని. అయిన, నాభాగ్యదోషమున నాహృదయము నమ్మఁజాలకున్నది. యుక్తాయుక్తముగ నితనిం జర్చించెదఁగాక. (ప్రకా) అయ్యా! రాములకింకెవ్వరు నాప్తులు లేరా?

ఆం—తల్లీ! శుభలక్షణ సమన్వితుఁడగు లక్ష్మణుఁడు మాత్ర మతని వెనువెంట నున్న వాఁడు.

సీత—వారు రాజత్వోచిత వస్త్రములు ధరించి కన్నులపండు వొనర్చుచుండిరా?

ఆం—లేదు. తాపసులచందమున వల్కలాజినములుగట్టి యుండిరి.

సీత—మహనీయా! వారియంగమచ్చములు గుణానఘు లేవైన గురుతించియుంటివా?

ఆం—మీరు నన్నిట్లనుగ్రహించుట మహాప్రసాదము అమ్మా! చెప్పెదవినుము.

తే॥ గీ॥ మేచకాభ్ర సన్నిభమైన ♦ మేనివాఁడు
జగములెల్ల సంరక్షింపఁ ♦ జాలువాఁడు
దశరథ తపఃఫలంబయి ♦ తనరువాఁడు
రాముఁడు సెలంగు జగదభి ♦ రాముఁడగుచు.

మఱియుఁ బరిపూర్ణ జ్యోత్స్నాధవళితమగు మేనికాంతితో సౌభాగ్యసూచక మహాలక్షణములతో విరాజిలుచుండియు విధిప్రేరణంబునఁ గాంతిఁదొలంగి యాలక్ష్మణుఁడు రామునకుఁదోడునీడయై యున్నవాఁడు.

సీత—(స్వగతము) ఇఁక నాభావిసౌఖ్యమునకు నేనేలసంతసింపకుందును? అయిన నిఁక నొక్కయంశమమాత్రమె కల, దదియు నితనిముఖంబున వినియెదఁగాక. (ప్రకాశము) పుణ్యాత్మా! ఇంతకుముందు రాముని సర్వశక్తునిగ సంబోధించితివే? అట్టివారు రాజ్యముఁగోల్పోవనేల? దీనవృత్తి వనమ్ములఁ బరిభ్రమింపనేల?

ఆం—పరహృదయ విమర్శనాఢ్యమై యడుగఁబడెడు ప్రశ్నల కుత్తరమిచ్చుటకు సంసిద్ధుఁడనై యున్నాఁడను.

తే. గీ. జననివరమును దీర్పఁగ ♦ కణముగట్టి
పురము వెలువడి కానన ♦ భూములందు
మెలఁగుచుండెడు సుఖమును ♦ దొలఁగియైన
జనులకుఁ బ్రియమొనరింతు ♦ రనఘమతులు.

ఏతత్కారణముగ రాజ్యమువీడి యడవులకువచ్చి ప్రమాదవశమున నిన్నుఁగోల్పోయి విలపించుచు దైవవశమునఁ గిష్కింధాధిపుఁడగు సుగ్రీవునితోఁ జెల్మి యొనర్చి సర్వసమ్మాన్యులై యున్నవారు.

సీత—మహత్తర సంపదలచేతను సమగ్రవైభవములచేతను సేంద్రస్థాన మలంకరించిన యాసుగ్రీవచక్రవర్తి నిరుపేదలును నిరాశ్రయులును నగు రామలక్ష్మణుల నాదరించెనన్న నేనెట్లు నమ్ముదును. శ్రీవంతులు ధీమంతులైనను నిరుపేదలఁ జుల్కనఁగాఁ జూతురుకదా?

ఆం—అమ్మా! నీకట్టిసంశయమువలదు.

తే. గీ. అలఁతిమొగుళులఁ జిక్కిన ♦ యంతమాత్ర
ద్వాదశాత్ముని తేజంబు ♦ దలఁగునెట్లు?

కళలుమాసినఁ గాసల ◆ మెలఁగుచున్నఁ
బుణ్యమూర్తు లెయ్యెడనైనఁ ◆ బూజ్యతములె.

కావున సుగ్రీవుఁ డెంతటి తేజోవంతుఁడైనను భగవదంశావిర్భూతులగు రామలక్ష్మణుల నతఁడు నిరాకరింపలేదు. ఇదిగాక గర్వశత్రువగు వాలిని సంహరించి తద్రాజ్యమునకు సుగ్రీవునిఁ బట్టభద్రునిగ నొనర్చినందున సామ్రాజ్యమంతయు రామునిదిగాఁదలంచి పూజించువాఁడు.

సీ—మారుతీ! నీ సందేశమువలన నాకూరట జనించినదిగాని యేతద్విషయములెల్ల నీకాప్తులగు వారిచే విని యిట్లు సమర్థింపఁగూడదా?

అం— అమ్మా! నేనెంతని విన్నవింతును? అకటా! ఇంకేమిగలదు? రామా! సర్వసైనికుల సమక్షమున నగ్రగణ్యుఁడని చేరఁ బిలిచి పంచుటయెల్ల నిట్టియిక్కట్టులఁ బెట్టుకొనుటకే గాఁబోలు? నేనెంతచెప్పిన నీమె తాను బట్టిన కుందేటికి మూఁడే కాళ్లనుచున్నది. (యోజించి) మంచిది. ఇప్పటికి సాధనోపాయ మొక్కటి జ్ఞప్తికి వచ్చుచున్నది. (ప్రకా) అమ్మా! నీసంశయనివృత్తి కొఱకు నేనొక్కటి స్మరణకుఁ దెచ్చెదను.

సీ—అదేది?

అం—ఆనాఁడు పంచవటీతీరమున హృదయాకర్షణమగు మాయామృగమును జూచి దాని నీ వపేక్షించి నీనాథునకుఁ దెల్పుటయు, నీకోరిక దీర్పఁ దలఁచి ధనుర్ధారియై రాముఁడు మృగము వెంటఁ జనుచున్నతఱి, హాలక్ష్మణా! యనుశబ్దంబు వినవచ్చుటయు, రాక్షస కృత్రిమములకు దిగులొందక రామసంరక్షణార్థమై సౌమిత్రి ననుప యత్నించుటయు, సౌమిత్రి నీ యేకాంతస్థితికిఁ దద్దయు వగచి నిన్నొంటిగ విడిచి చనఁ గాళ్లురాకున్న, హృదయనిర్భేద కాలాపములచేత నతని నొప్పించి పంచుటయు, విషాదమూర్తియై యతఁ డెట్టకేలకు నినుఁబాసి యెడఁగలుగఁబోవుటయు, జ్ఞాపకమున్నదా?

సీ— అకటా! నిజము. నిజము. నాకెవ్వరట్టి సమయమున దిక్కుగలుగరని శోకించుచున్న నామఱందిని—అతివినయవంతుని—దూషించిన యాపరమచండాలిని నేనే యనుమాట వాస్తవము. తరువాత?

అం—సౌమిత్రినిర్యాణానంతరము మాయావేషధారియై వచ్చి, రావణుఁడు నిన్నుఁగొని వియత్పథంబున ఋష్యమూకాద్రిపై నేఁగుచున్నపుడు, నీభూషణంబు లందు జాఱవిడుచుటయు, గతవృత్తాంతములు. ఆమణిమయభూషణములఁగొని, నిను వెదకుచు వచ్చిన రామునకుఁ, బ్రేమపూర్వకముగ సుగ్రీవుఁడర్పించిన నాఁటనుండి వారత్యంత మైత్రితోఁ గాలముఁ బుచ్చుచు, నిన్ను వెదకించుటకనేక ప్రయత్నము లొనర్చి మమ్ముఁ బంచుటయుఁ, దుదకు సముద్రతీరమున సంపాతివలన నీవృత్తాంత మెఱింగి నేనిచ్చటికి వచ్చినాఁడను. ఇయ్యెడ నాలసించితినేని ప్రభుకార్యము చెడును. ఇంకనైన నాయెడ సంపూర్ణ విశ్వాసముంపవేని రాముని చెంతకుఁబోఁజాల నీచరణంబులకడఁ బ్రాణములు వదలువాఁడ.

—మారుతీ! క్షమింపుము. రాక్షసమాయలచేఁ గలఁత నొందిన హృదయమును మఱల్చుకొనలేక నిన్నిట్లు శంకింపవలసె. అయినను బులస్త్య వరప్రసాదకు లగు రక్కసులకుఁ దక్క, బెరల కీలంకాధిరోహణము దుర్ఘటము; కావున నీవు దుర్లంఘ్యమగు సముద్రముఁ గడచు టెట్లను సంశయము మాత్రము నన్ను వదలకున్నది. ఇంతకు ముందు మారుతపుత్రుఁడ నంటివి. అట్లయిన నీవిశ్వరూపమును బ్రదర్శింప వేఁడుచున్నదానను.

౩౦—(స్వ) ఛీ. ఛీ. నేనత్యంతము కలుషస్వభావుఁడను. కాదేని యీమాత నన్నిట్లు శంకించియుండునా? సముద్రోల్లంఘన మంతకష్టముగఁ దోఁపలేదు; గాని ఈమె మనోవృత్తిని మఱల్చుట కడుంగడు కష్టమగుచున్నది. (ప్ర) తల్లీ! నీవనినట్లు విశ్వరూపప్రదర్శనమున కిదియదనుగాదు. గూఢచారినైవచ్చిన నేను, శత్రువుల మధ్యమున విశ్వరూపమునుజూపుదునేని, పరప్రకర్షము సహింపఁజాలని యీదానవులకు మనోనలమంకురించును. అపుడు రక్కసులతోఁ బోరవలసివచ్చును. జయాపజయములు మనమెఱుంగము. ఒకవేళ నేను రణమునఁ బ్రాణములువాయుట తటస్థించెనేని, మఱలఁ గిష్కింధకుఁ బోయి రామున కీయుదంతం బెఱింగించువారెవరు? ఈసందేశ మొక్కటి తెలియనినాఁడు రాముఁడు పత్నీవియోగము సహింపఁజాలక ప్రాణము వాయును. అన్నమరణమునకు శోకించి లక్ష్మణుఁడు మరణించును. సోదరవిహీనమైన రాజ్యపదవినైనఁ బరిత్యజించి, భరత శత్రుఘ్నులు లోకాంతరగతులగుదురు. పుత్రశూన్యమైన గృహంబులనుండనోల్లక కౌసల్యాదియంతఃపురజనములు, రజ్జు విషాగ్ని జలములనైన నుసురులు గోల్పోవుదురు. నీచర్చలకు మోమోడి విశ్వరూపము బ్రదర్శింతునేని బ్రమాదము కలుగఁగలదు. ఇట్లగుటచేత నేను మరణమునకు శంకించితిననిమాత్రము తలంపకుము. మహాత్ముఁడగు రామునకు నాదేహసర్వస్వ మర్పించుటకైనను శంకింపను గాని నామరణము సూర్యవంశవినాశమునకుఁ గారణమగునేమోయని శంకించువాఁడ. మఱియు,

శా. ఆరాముం డనుపంగ, నేనిటకు ని ♦ త్యాలోలకల్లోలపా
పారావారముదాఁటి, రక్కసుల ద ♦ ర్పంబెల్ల మాయించి, నిన్
జేరన్ వచ్చితిఁ గృత్రిమాకృతిఁ గనన్ ♦ జింతించెదేనిన్, ద్యుతి
స్ఫారం బీ మణిముద్రికైనఁ గనుమా! ♦ శంకింప నింకేటికిన్?

(ముద్రికనిచ్చును.) (సీతయుఁ బరిగ్రహించి.)

సీత—ఆర్యా! ఈ పవిత్రమూర్తి నన్యథా భావించియుంటిని. ఇది నాప్రాణేశుని ముద్రిక యగుటనిక్కంబు. (ముద్రికను లక్షించి చూచుచు.)

తే. గీ. ప్రాణములకెల్లఁ బ్రాణమా ♦ పతికరమునఁ
గరము వెలయుట నీదు భా ♦ గ్యంబ కాదె?

వలయమా! నిన్నుగనుటఁ జీవమెయి మేను
విడిపోనున్న ప్రాణముల్ ♦ గూడె నేఁడు.

నాథుని పాణి నలంకరించుకతన నీవు నాకుఁ బూజ్యవు. (అని దానినకన్నులఁ జేర్చును.)

సీ—ఆంజనేయా! అత్యంతము కఠిన స్వభావురాలనగుట మొదట నిన్నుఁ దిరస్కరించితి. నానేరమి క్షమింపుము.

ఆం—అమ్మా! అదియొక నేరమికాదు. కష్టావస్థయందు సర్వుల మనసులు నిట్లే యుండును. మఱియు మొదట నీవు నన్నుఁ దిరస్కరించినను దుద కనుగ్రహించి విశ్వసించుటచేత నేను కృతకృత్యుఁడనైతిని.

సీ—అట్లయిన నింక నీప్రభువుల చెంతకుఁ జనుము. దుష్టరాక్షస సమన్వితమగు నీస్థలమున నాలసింపరాదు. అచ్చటికేఁగిన వెనుక మత్ప్రాణనాథునితో నిట్లు విన్నవింపుము. "స్త్రీలనర్థకలకారణములు. అందువలనఁ గాద మాయామయమృగము దేర, మిమ్ముఁ బంపితి. ఏతత్కారణమున నిన్నియిడుమలు ప్రాప్తించినవి. అయినను బ్రాణప్రాణముగ నమ్మియుండిన ధర్మపత్నిని విడిచియుండుట మీవంటి పుణ్యమూర్తుల కుచితముగాదు. నానేరములు సరకుగొనక క్షమించుటొప్పు" ఇంతకంటె నేను మనవియొనర్పవలసిన దేమికలదు? మారుతీ! నామఱఁదితో ముఖ్యముగ నిట్లనుము. "లక్ష్మణా! సాధుస్వభావుల మనసు నొప్పించిన యాపాపిష్ఠులెన్నఁడును సుఖింపరు. ఇందుకు నేనే సాక్షిని. అట్టినిన్ను గర్హించిన ఫలము కట్టికుడిపినది. సైన్యసమేతముగ వచ్చి యీచెఱ విడిపింపుము. నా చెడువాక్యములు మనసున నుంచకుము."

ఆం—అమ్మా! అతి విశ్వాససంజనితమగు ప్రేమాతిరేకమున నీకార్యమునకై నాహృదయమిట్లు త్వరపెట్టెడు. ఏమన,

చ॥ పరిజనులేల? నాయక నృపాలుఁడు వచ్చుటదేల? భూరిసం
గరమది యేల? శాత్రవ స♦కాయమునొక్కటఁ జీల్చివైచి, మ
చ్ఛిరమున నిన్నుదాల్చి, పురిఁ ♦ జేరఁగనోపుదు నొక్కరుండ, న
ద్ధురతర తేజమెల్లెడలఁ ♦ దోఁపఁగ నమ్మరో! సంతసింపుమా!

శాత్రవ సైన్యంబులఁ బ్రధ్వస్తంబు గావించి, సుఖముగ నిన్నుగొనిపోయి రాముల చెంతఁ జేర్చువాఁడ. ఇందు నా కసాధ్యములేదు. అంతవఱకేటి విచయ నేల? తల్లీ! నాభుజపీఠ మలంకరింపుము.

సీ—అయ్యా! నీవెంతకైనఁ జాలుదువని నేనెఱుంగుదును. కాని యన్యపురుష స్పర్శనమెన్నఁడైన నొనర్పకుండునట్లు నిశ్చయించుకొన్నదాన నగుటచేత నీకార్యమునకు సమ్మతింపఁజాల: నదిగాక సహజ ప్రతాపవంతుఁడగు రఘురాముఁడు చోరవృత్తిఁ దనసతినిఁ గొంపోయెనుగాని, రావణుని గర్వమణంపలేకపోయెనని లోకు లాడుకొందురు. మఱియుఁ బతివ్రతలగు స్త్రీల నవమానించినందులకు

దండనమే లేకపోవును; కాన సబాంధవముగ రావణుఁడు రణావనిం బొరలు చుండఁ జూచియే నేను పురిఁ బ్రవేశించెదను.

ఆం—రావణ నిర్మూలనాభీల సంరంభము త్వరలోనే ప్రారంభింపఁబడును.

సీ— మఱియు నాత్మేశునితో నిట్లుచెప్పుము. "ఈ దురదృష్టవంతురాలు మీరాకకై రెండునెలలు వేచియుండును. అటుపిమ్మట మీసందర్శనభాగ్యము లభింప దేని నాత్మహత్యయొనర్చి యీ లోకమును విడిచిపోవుట నిజము."

ఆం—తల్లీ! సామాన్య స్త్రీలంబలె నీవిట్లు శంకింపనేల? ఇదే వినుము.

చ. అనుజసమేతులై తరలు ♦ నంతకు రెండగుమాసముల్, తుదిన్
వననిధిదాఁటి నిక్కముగ ♦ వచ్చి చెఱందొలఁగింతురమ్మ! పే
ర్చిన ఘనశోకవృత్తినిఁ గృ ♦ శించుట వింతగదమ్మ! భూమినె
వ్వనికిఁ బరంబటమ్మ! బల♦న ద్విధికృత్యము గ్రమ్మఱింపఁగన్.

అమ్మా! నీయుదంతంబుసర్వంబు నివేదించువాఁడ. నీ వదలఁబోకుము. నే నీలంకఁ జొచ్చి నిన్నుదర్శించినందుకుఁ బాఠ్యాణంబుగ నీశిరోరత్న మానవాలొసం గుము. లేకున్న నన్ను వారు విశ్వసించు టెట్లు?

సీ—మారుతీ! నీ నిసర్గస్వరూపం బెట్టిదో గాని నాతలమానిక మియ్యనోప. విశ్వరూప మియ్యెడఁ బ్రదర్శింప వేఁడుదాన!

ఆం—(స్వ) అహా! స్త్రీలహృదయము కేవలము భ్రాంతియుతమైనదికదా? విశ్వరూప ప్రదర్శనమున నైన నేనీమెకరుణకుఁ బాత్రుఁడనయ్యెదఁగాక.

(ముకుళిత కరములతో.)

ఓ! దయామయా! సర్వజగన్నియంతా!

ఆ. వె. తలఁచువారి స్మృతిప ♦ థంబునఁ బొడగట్టి
విశ్వమంత వెలుఁగు ♦ వేల్పవీవు
నిన్నునమ్మినాఁడ ♦ నీవాఁడననువాఁడ
విశ్వరూపమిందు ♦ వెలుఁగఁజేయు.

(విశ్వ రూపధారణము.)

సీ—(స్వగతము) మాయురే! స్వరూపవిలోకనార్థమై కాంక్షింపఁబడిన యీ రూప మిప్పుడు నాకు భయానకముగఁ బరిణమించుచున్నది. ఆంజనేయా! అకాలప్రళయ సూచక భయంకరాకార మిద్దాని నుపసంహరించి, తొల్లిఁటి నీప్రసన్న మూర్తి నాకడఁ గాన్పింపుము.

ఆం—జననీ! నమస్కారము.

సీ—కం॥ విలయ సముజ్వల కీలా
వలినైన శరములనైనఁ ♦ బాటింపని, ప్రో

జ్వాల మూర్తిఁ దాల్చి మనుమా
కలకాలము లోకవిహిత ♦ కరణధురీణా!

మారుతీ! చిరంజీవి వగుము. శిరోరత్నమిదే కైకొమ్ము.

ఆం—ఈ శిరోరత్నమువలన నేనిప్పు డనుగ్రహింపఁబడితిని. అమ్మా! ఆహార విశ్రమాదుల కెడమీక దీర్ఘప్రయాణంబు సేయుటచేత నాఁకలి మెండగుచున్నది. ఈ రసాల వనమున స్వాదుఫలముల భక్షించి చనెదను.

సీ—అయ్యో! మూలనాశము మాత్రము గాకుండ నీయిచ్ఛవచ్చినట్లొనర్పుము.

(నిష్క్రమింతురు.)

—యవనిక—

---

## చతుర్థరంగము—అశోకవనమునందలి పటకుటీరములు.

(ప్రవేశము: ఆంజనేయుఁడు.)

ఆంజ— సహచరులగు జాంబవ ద్గవయ ప్రముఖులతోడను యువరాజుగారితోడను బల్కిన యాశపథంబులు నేఁటికి ఫలించినవి. రామ నిర్దేశితుఁడనై లంకఁ జొచ్చి యియ్యెడఁ గావలసిన పనులెల్లఁ దీర్చితి. ఇఁక మరలెదఁ గాక. (యోజించి) కాదు. కాదు. బహుప్రయాసముచేత శాత్రవపట్టణముఁ జొచ్చియు భీరుత్వంబున నడఁగి పోవుట శూరధర్మముగాదు. ఇప్పు డీదానవులతో రణమొనర్చి కోపాగ్నిఁ జల్లార్చుకొనలేకున్నను, హృదయరంజక కుసుమ ఫల లతా ప్రతాన విరాజితమగు, నీయశోక వనమును భస్మీపటలంబుగఁ జేసి పైచెద. ఇందువలన రామమనఃప్రమోదమును రావణ మనోనలమును సంఘటింపఁగలవు. (వనములోఁ బ్రవేశించును, చెట్లు నిర్మూలమగుచుండును.)

(నేపథ్యమునఁ గలకలము.)

ఓహో! వనరక్షకులారా! ప్రాక్పశ్చిమోత్తరంబులంగల పారిభద్ర క్రముక రసాలాది తరువులు మహావాయూన్మూలితములై నేలఁ గూలుచున్నవి. తరు సమాశ్రయమగు పక్షికులంబు భూనభోంతరంబు మాఱుమోఁగునట్లాక్రందించుచున్నది. చూడుఁడు! చూడుఁడు!

(ఇరువురు వనపాలకులు ప్రవేశింతురు.)

తామ్రాక్షుఁడు—యూపాక్షా! సత్వరముగఁ బరుగిడుచుంటి వేల! ఇప్పు డంతటి యపాయమేమి సంభవించినది?

యూ—అపాయము కాదు తామ్రాక్షా! ప్రాణాపాయము సంభవించినది.

తా—ఎందువలన?

యూ—నీవెఱుఁగవా? ఎక్కడ నుండియో వీరయోధుఁడొకఁడు మన యశోకవనముఁ జొచ్చి, కావలివారల నెల్లవధించి, తత్పరిరక్షితమగు వనమును బగ్గముగఁ జెఱికివేయుచుఁ, బ్రళయాంతకుండట్లు గన్పట్టుచున్నాఁడు. అతని బారికిఁ దప్పి, రావణునకుఁ దెలుపఁ బోవుచున్న నన్నడ్డగించి, నా ప్రాణములుఁగూడ దీయించెద వేల? విడుము విడుము.

తా—అట్లయిన నతఁడటనుండి కదలక మున్నె పురిఁజేరుదమురమ్మ.

(పరువిడుదురు)

—యవనిక—

(ఆంజనేయుఁడు మకరతోరణమున నుండును—ప్రవేశము—అక్షయకుమారుఁడు)

అక్ష—(స్వగతము) మాయురే! ఇతఁడెంత నిర్భయుఁడుగఁ బొడకట్టుచున్నాఁడు!

తే॥ గీ॥ శత్రుకాంతారదహనమా ♦ శాతశరముఁ
గరమున ధరించియుంటఁ దా ♦ నరయఁడొక్కొ?
ప్రాణముల నిచ్చగింపఁడో? ♦ ప్రాలుమాలి
మైమఱచి యుండెనో? కాక ♦ మఱలఁదరమె?

(ఆంజనేయుఁడు పండొకటి నమలుచు దిగును).

అక్ష—ఓరీ! గూఢముగఁ బురిఁ బ్రవేశింపనేల? నీవెవ్వఁడవు?

ఆంజ—చెప్పెద వినుము.

ద్విపద.

కపటవృత్తంబునఁ ♦ గడఁగిరాఘవుని
చపలాక్షిఁగొన్న యా ♦ జడ బుద్ధిమాన్పఁ
గ్రవ్యాదులకునేన ♦ కాలహంతకుఁడ
భవ్యుఁడౌ రఘురాముఁ ♦ బాయనివాఁడ ॥

అక్ష—మానవాధమా! ప్రల్లదములు వలుకకుము. భీమపరాక్రమ విజృంభితులగు దానవులచెంత నీయాటలు సాఁగునా? ప్రాణములు సంరక్షించుకొన నాస గలిగెనేని యెందైన దాఁగి చనుము.

ఆంజ— ద్విపద.

రణరంగమున నీశి ♦ రంబుఖండించి
జనులుపొగడ దాఁగి ♦ చనియెదలెమ్మ?

అక్ష—ఓరోరీ! మిథ్యాభియోగప్రలాపా! పరిభాషణంబు లిఁక మాని సమరక్రియోన్ముఖుఁడవు గమ్ము.

ఆంజ—

ద్వి ప ద .

సన్నద్ధమై పోరి ♦ సంహారమునకు
నున్నాఁడ నియ్యెడ ♦ నుడుగక కితవ!

అక్ష—అట్లయిన నిదే మదీయ శాతశిలీముఖమునకుఁ దప్పించుకొమ్ము. (వీడును).

ఆంజ—(వేటు తప్పించుకొని) నీయంతిమదశ సమీపించినట్లు స్మరించుకొనుము.

అక్ష—దురాత్మా! భుజాభుజిఁ బెనఁగి మఱి మాటాడుము.

(ఆంజనేయుఁడు హస్తవిన్యాసముఁ జూపును. అక్షయకుమారుఁడు నేలఁగూలును). (యవనిక)

తృ తీ యాం క ము .



కావునఁ ద్రిలోకాధీశునికైన తెలియని నేనొక్క నరసంతతికిమాత్రము తెలియ వలసియున్నది. అశోకవన రక్షణార్థమై పంపఁబడిన యక్షయకుమారుఁ డింకను మఱలలేదు కదా ?

విభీ—(స్వగతము) అక్కటా! ఏ మాయెనో ?

(వనరక్షకులు ప్రవేశింతురు).

ఓ రక్షోధినాథా! మాపాట్లెల్ల నేమనిచెప్పుకొందుము? ఎన్నఁడో రాఁబోవు నని వినుచున్న మహాప్రళయము మనకుమాత్ర మిపుడే సంభవించినది.

ప్రహ—ఓరీ! ఏమి సంభవించినది ?

విభీ—(స్వ) రాక్షసకులక్షయ మగుటకు మూలకారణమగునాయేమి ?

వన—అబ్బబ్బ! ముందు మీదాఁపుఁజేర్చి మమ్ము రక్షించినచో మేమావెనుక విన్న వించుకొనెదము.

(భయభ్రాంతచిత్తులై దిక్కులు పరికించుచున్నారు).

ప్రహ—ఓరీ భీరులారా! మీకింతటి భయమేల? రక్షోధినాథుని సభాంతరమున నుంటిరికదా! దేవేంద్రాదులు వచ్చినను భయములేదు. చెప్పుఁడు చెప్పుఁడు. మీకేమి యాపద సంభవించినది ?

వన—(స్వ) ఇప్పటికి మాప్రాణములు కుదుటఁబడినవి. (ప్రకా) దేవా! మన యశోక వనమున కెచ్చటనుండియో మానవుం డొకఁ డరుదెంచి, రాజపుత్త్రికను సంభాషించి, కుశలవార్తలడిగి యామెనూఱార్చి, రక్షకులను నిప్పుడే నిర్మూలము సేయఁ జూచుచున్నాఁడు.

విభీ—రక్షోరాజ్యక్షయప్రబంధమున కిది మొదటియాశ్వాసము గాఁబోలు.

రావ—హా! ఏమి యీకాలవైపరీత్యము? పాలకులారా! అటువిమ్మట నేమి జరిగినది?

వన—మన యశోకవనమునఁ జేసినకృత్యము లేమని విన్నవింతుము ?

సీ॥ సురసాలసదృశో భా♦సురసాలముల నెల్లఁ
గలికలి మొదలూడఁ ♦ బెఱికివైచె
దారసిల్లిన వీర ♦ దానవావలి నెల్ల
యమసదనంబున ♦ కనిపివైచె
దుర్ముఖాదులతోడఁ ♦ దుది నెనుబది వేల
దుర్దమాసురులను ♦ దునిమివైచెఁ
బ్రాకారమున వన♦పాలగృహమ్ములఁ
జిందఱవందఱఁ ♦ జేసివైచె

తే॥ గీ॥ దోర్బలుని నక్షకుమరునిఁ ♦ దుంచివైచె

రావ—హా! పుత్రకా! ఎంతటి దారుణవార్త వినవలసివచ్చెను?

వన— తే॥ గీ॥ చేయుదగు పనులన్నియుఁ ♦ జేసివైచె
నెందుఁబోదుము? గతియేమి? ♦ యెవరుదిక్కు
అరయ! ముల్లోకముల వాని ♦ కడ్డులేరు.

రాజపుత్రికయగు సీతకు నీడనొసంగు వృక్షమొక్కటిదక్క తక్కిన తరువులు నేలఁగూలినవి. ఇప్పటికి భయంకరాకారుఁడై యున్నవాఁడు.

ప్రహ—ఓరి! హీనసత్వుఁడగు నొకమానవుఁ డింతపని యొనర్చెఁగా?

సిధి—(స్వ) కాలము సమీపించినపుడు పిల్లులు బెబ్బులులుగాఁ బరిణమింపకున్నె? ఇదియునుంగాక,

తే॥ గీ॥ వలచి యాభీలమౌ నగ్ని ♦ వ్రాలినట్టి
శలభ ముద్వేల కీలల ♦ సమయునట్లు
సాధ్వినుల నలయించు దుశ్చరితుఁడును స
బాంధవంబుగ నాశంబుఁ ♦ బడయకున్నె?

రావ—అకటా కుమారా! నీవక్షయ కుమారుఁడవని తలఁచితినిగాని, క్షయకుమారుఁడవని యెఱుంగనైతి.

తే॥ గీ॥ బాణసంధానమెఱుఁగని ♦ పట్టి! నిన్నుఁ
గదనమున కని పంచితిఁ ♦ గాఁటికిపుడు
నిన్నుఁగానక పలవించు ♦ కన్నతల్లి
నెటుల నూఱార్పఁగలుగుదు ♦ నికఁ గుమార!

హా! తనయా! అఖిలదైత్యదానవచక్ర పరిరక్షణమొనర్పఁజాలు నీతండ్రి నిన్నొక్కని రక్షింపలేకపోయెఁగా?

ఇం— తండ్రీ! దుర్బలునింబోలె మీరిట్లు విలపింపనేల? సహోదరు నిర్జించిన మానవాధముంబట్టి కడకండలుగఁజేసెదనొండె, విపక్షశిక్షాదక్షుంబగు బ్రహ్మాస్త్రముచే బంధించి మీపాదములకడఁ బడవైచెనొండె, నన్నాశీర్వదించి పంపుఁడు.

రావ— కుమారా! జయలక్ష్మీకరగ్రహణమొనర్తువుగాక పోయిరమ్ము.

(యవనిక)



## ద్వితీయ రంగము – అశోకవనము.

(ఆంజనేయుఁడు ధ్యాన నిమీలితలోచనుఁడై)

ఆహా! భక్తిపరాయణుల నెట్టియాపదలు పొందవు దా!

సీ॥ ఘనులు కల్మషముక్త ♦ కాంక్షులై యెవ్వాని
బ్రణుతింతు రత్యర్థ ♦ భక్తిమీఱ?
విబుధు లెవ్వాని సే ♦ వించి సనాతనం
బైన నిశ్శ్రేయసం ♦ బందువారు?
నిర్జితేంద్రియులకు ♦ నిఖిలార్థులకుఁ గల్ప
భూజమై యెవ్వాఁడు ♦ పొల్పుమీఱు?
వినుతజనాభీల ♦ విపదంబుధికి బాడ
బప్రతీకాశమై ♦ పరఁగు నెవఁడు?
తే॥ గీ॥ సముఁడు త్రైలోక్యనుత యశ ♦ స్సమధికుం డ
నాథజన బాంధవుండు స♦నాతనుండు
నేమహామహుఁ డట్టిశ్రీ♦రాముఁ డుండు
కరుణనీక్షించి మమ్ములఁ ♦ గాచుఁగాత.

(ఇంద్రజిత్తు సైన్యముతోఁ బ్రవేశించును.)

(లోపలధ్వని.)

ఓ, రక్షోగణనాథా! సన్నిహితములయిన కురుజములఁ బెంచి నెండాఁడే, దవ్వులఁ బరుఁగిడుచున్న త్రేక్కయి యెదురుచూచు శాఖాలంబుల్లు, గప్పిపుచున్న యమ్మనుజరూపాధముఁ, డామకరతోరణ సమీపమున నుండెడు చూడుము, చూడుము.

ఇం— ఓరీ! మదోన్మత్తచిత్తా! కఠోరహృదయుఁడవై పలువురరక్కసుల నిష్కారణముగఁ జంపిన యీ దురహంకార మడఁగించెదఁ గాక, తొలఁగిపోకుము.

ఆంజ— ఓరీ దుర్విదగ్ధప్రలాపా! రణరంగమున శాత్రవశిఖాఖండన మొనర్చి జయధ్వజ మెత్తెడు వీరుఁడనుగాని, రణభీరుత్వమునఁ బారిపోవు దానవుఁడఁగాను. నీవలెనే పౌరుషంబులు బలికిన దానవులెందఱో మడిసి చనుటెఱింగియు, నీవేల మరణమునకు సమ్మతించి రణమునకు వచ్చితివి?

ఇంద్ర— దురాత్మా! త్రయస్త్రింశత్కోటి సుపర్వుల నెదిరించి, సంగ్రామరంగంబున నిర్జరేంద్రుని బంధించిన నన్నధమునిగ భావించితివి గాని చతుస్సముద్ర ముద్రిత ధరావలయంబునంగల రాజులెల్లరు, మాకువశంవదులై వర్తించుచుండుటయు, త్రిలోకాధిపత్యము మాయందుండుటయు గ్రహింపఁజాలవైతివి.

ఆంజ—ఆత్మప్రశంస లికమాని సమరోన్ముఖుండవుగమ్ము. నీ త్రిలోకాధిపత్యమును త్రిలోకసేవకత్వమునకుం బాల్పఱచెదంగాక.

ఇంద్ర—కించిద్బలోపేతుండవగు నీవు రణమనిన ముందంజవేయుచుంటివి. అలంతులగు దుర్ముఖాదులం గూల్చుటయునుకొంటివా? నానిశితాస్త్రముల బారింబడి, బ్రతికిపోవ బ్రహ్మాదులకైనం దరముగాదన నీవెంత? ఇవియన్నియు నీయణుమాత్రస్వరూపముం జూచి జాలినొంది పలికితి; గాన నేనోడితినని వచింపుము. ప్రాణములందీయక కారాగారమున నుంచెదను.

ఆంజ—దానవాధమా! పరస్పరవిరుద్ధంబులగు పలుకులుమాని సన్నద్ధుండవగుము. రణమో - మరణమో - తేటపడును.

ఇంద్ర—(బాణము సంధించి) ఇ యాగ్నేయాస్త్రంబొక్కటియ నిన్నుం గూల్చుంగాక.

ఆంజ—(వేటుతప్పించుకొని) (పరిహాసముగ) ఆహాహా! నీనానాస్త్రప్రయోగకౌశల మెంతని కొనియాడుదును!

తే॥ గీ॥ విరిసరులకంటె మిక్కిలి ♦ మృదువులగుచు
జీర్ణకాష్ఠముకంటెను ♦ శిథిలమగుచుఁ
బరఁగునీశరములు మహా ♦ ప్రథనమందు
భయదశత్రువిఖండన ♦ క్రియకుఁదగునె?

కరదండ మూఁతగాఁగొని శరధిఁ గ్రమింపఁబోవు జడునిపగిదిని నీవీ మృతకాష్ఠములట్టి శరములు గొనివచ్చుటచే లజ్జింపవా?

ఇంద్ర—ఓరీ! నీపరిరంభణవాక్యములకిదె ప్రత్యుత్తరమగుంగాక. (వదలును)

(వేటు తప్పును.)

ఇంద్ర—(నిర్వేదముగ) ఏమి యాశ్చర్యము! శత్రుమస్తకవిఖండనధురంధరములగు నాశరపరంపరలు నిష్కపటులకుం జేసిన కీడులట్లు నిష్ఫలములైపోవుట కేమి హేతువు? కాని మీ బ్రహ్మాస్త్రముచేతనైన నితని బంధించెద. (వదలును)

(ఆంజనేయుఁడు బద్ధుఁడగును.)

ఇంద్ర—రక్షస్సైనికులారా! శృంఖలానిబద్ధుఁడైన యితనిని సభామండపమునకుఁ గొనిరండు. (నిష్క్రమింతురు)

(యవనిక)

---

## తృతీయరంగము - ఆస్థానమండపము.

(రావణ విభీషణ ప్రహస్తప్రముఖులు కొలువుదీర్చియుందురు).

రావ—ప్రహస్తా! ప్రాగ్భాగపు గవనియందేర్పఱచిన రక్షకవర్గమున కందే విడుదలొసంగఁబడినదా? శాసనపత్రముల నంపఁబడినవా?

ప్రహ — దేవా! రక్షకవర్గమునకుఁ దగు సౌకర్యములన్నియు నేర్పాటుగావింపఁబడినవి. తక్కుంగల విషయములకు నిర్ణయాధికారి యొక్కఁడు నియమింపఁబడెను ఆఱువేలమందియోధు లిపుడు ప్రాగ్ద్వారపుఁ గండకమును గాపాడుచున్నారు.

(లో ప ల ధ్వ ని)

ఓ రక్షస్సార్వభౌమా! మహాసంగ్రామరంగమున విజయలక్ష్మి నలంకరించి, యొక వీరయోధునిఁ గొని మేఘనాధుఁ డల్లదె రంగమండపమున కేతెంచువాఁడు.

రావ — (ఆలించి) జగజ్జేగీయమాన ప్రతాపవంతుల మను బిరుదమిప్పుడు చెల్లినది.

(అప్పుడు పాశబద్ధుఁడగు నాంజనేయుఁడు ప్రవేశించుచున్నాఁడు).

ఆంజ — (స్వగతము) ఈసభా రామణీయక మింతింత యనుటెట్లు? సమగ్రవైభవ విభాసితుఁడగు నితఁ డొక న్యాయపథమును మాత్రము తిరస్కరించియుండనిచో జగత్త్రయంబున నితని నిర్జించువారుండియుండరుగదా! దుష్పథగామియగు వానిని సంపద్వైభవములు చిరకాల మాశ్రయింపవు. మఱియు

తే॥ గీ॥ ధర్మరతు నొందునేని ము ♦ దమ్ముఁగాంచు
రాజ్యలక్ష్మి ఫణీఫణా ♦ రత్నమట్లుఁ
గాక మెలఁగ విపర్ణతఁ ♦ గలుగుఁ జూవె
కంపతోడుగుసఁబడిచెడ్డ ♦ కమలమట్లు॥

కావున నితని చేఁజిక్కిన రాజ్యలక్ష్మియు విపన్నయైపోనున్నది.

రావ — ప్రహస్తా! ఈదుర్బలునికి తమునవే మనరక్షోభటుల మింత వెఱవవలయునా! చూచితే! విధివిధానము.

విభీ — అన్నా! ద్రోహింపై భగవదాదేశమును మీఱి చరించెడువాఁడు ప్రకృతియందలి పరమాణువునకు సైతము వెఱవవలసి యున్నది.

రావ — ఓరీ!

క॥ మృత్యువు దాయుట సేవి
కృత్యమునకుఁ గడఁగి లంక ♦ కేతెంచితి మ
ద్భృత్యులఁ జంపితి, వెవఁడవో?
సత్యమ వచియింపుమిచట ♦ జంకక నెదలోఁ.

ఎవని యాదేశంబునం జేసి నీవిదానవ విలోకన మహోర్పులం గ్రాఁగఁ బ్రయత్నించితివి? ఏరాజాధముఁడు నిన్నిదానవుల మధ్యకనిపెను? తథ్యము వచింపుము. లేకున్న నీదేహము పలలఖండములుగాఁ జేసి, యీరక్షక వర్గమున కాహుతి నిచ్చువాఁడ.

ఆంజ — ఔరా! ప్రతాపవాక్యములు! (ఆలోచించి) ఈమర్కటుఁ డిట్లు సమున్నత స్థలమునఁ గూర్చుండి పల్కరించుటయుఁ గ్రిందనుండి ప్రతివచనం బిచ్చుటయునా!

ఇప్పటి విధముంజూడ వీరు నన్ను చితాసనాసీనుం జేయునట్లు కాన్పింపదు. కావున వీరికి మనోనల మంకురించునట్లు, రావణశిరోభాగముపయి రెండింత లెక్కుడుగఁ గూర్చుండెదగాక. (ఉన్నతస్థలమునఁ బాదకట్టుచున్నాఁడు. అప్పుడు దానవు లాహాకారములు సల్పుదురు.)

ఆంజ—దీనానాథస్త్రీజనవిదారణ ఘోరకృత్యోన్ముఖ పరాయణా! రావణా! ఇదే నావచించుభంగి వినుము.

> క॥ వనితాపహృతుల దుష్టులఁ
> దునిమి ధరణిఁ బ్రోవ దశర ♦ థుని గర్భమునన్
> జనియించిన శ్రీ రఘురా
> మునకున్ భృత్యుండ వాయు ♦ పుత్రుఁడఁ గితవా!

విభీ—(స్వగతము) ఈరామభక్తాగ్రేసరుఁ డొక్కఁడే దానవవంశ విచ్ఛేదమునకు జాలునని తోఁచుచున్నది.

ఆంజ—హింసాపరులగు దానవుల నిగ్రహించుటకును, నహింసాపరులగు ఋషుల ననుగ్రహించుటకును, క్షీణధర్మమును బ్రతిష్ఠించుటకును జన్మించిన రఘురాముని భృత్యుఁడను.

రావ—ఆహా! నీప్రభువుల ధర్మపరిపాలనత్వమును నీసుశీలత్వమును వేఱుగఁ జెప్ప నవసరము లేకయే తెలియుచున్నది. ఎట్లందువేని?

> తే॥ గీ॥ దాఁగికొనివచ్చి యర్ధరా ♦ త్రింబునందుఁ
> బురిఁ బ్రవేశించినట్టి త♦స్కరుని నిన్ను
> బంటుగాఁ గొనునతఁడు నీ ♦ కంటెగుణము
> లేనుమడుగు లెక్కుడుగాక ♦ యేలయుండు?

కావున గోముఖవ్యాఘ్రములట్లు మెలఁగు మీధర్మప్రవర్తన నిందఁజాట నక్కఱలేదు.

ఆంజ—ఔనౌను. నిశ్చయంబుగఁ బ్రత్యర్థిపట్టణప్రవేశ మొనర్చి, దుష్టింబడిన రక్కసుల నెల్ల వధియించి, యశోకవనమును మూలచ్ఛేదము గావించి, స్వచ్ఛందవిహారము సల్పుచుఁ, దుదకెందఱ శత్రువులమధ్యమున బహిరంగముగ సభయందుఁ గూర్చుండుట చోగత్వమగుఁ గాని, పతిలేనిసమయముఁ గనిపెట్టి "భవతీ భిక్షాందేహి" యనిపోయి, యతిధసంతర్పణము ముఖ్యమని నిన్నతిథిగా భావించి విశ్వసించిన యమ్మాతను మోసపుచ్చి శారికాకిశోరమునుగొన్న గృధ్రము ననుకరించుచు, నాకాశమార్గమునఁ బరుగులెత్తుట చోరత్వమెన్నటికిఁగానేర్చునా?

రావ—ఒకవేళ బహిరంగముగనే మేమా సతీమణిం గొని భూమిం బఱతెంచియున్న, రావణ సమాలోకన సముజ్జ్వలకీలలకు శలభాయమానులై యుండురు కాంబోలు!

ఆంజ—శలభాయమానులైయుందురో తద్గర్వానలంబునఁ జల్లార్చియుందురో యిపుడె క్షేఁలుక పడును? కాని పరస్త్రీవిరుద్ధ ప్రలాపములవలన గర్హితాపహరణం బనెడి ఘోరకృత్యములవలన నీకు రానున్న యాపదలను మును మున్న సూచించి బుద్ధి గఱపుటకు వచ్చినాఁడను జగత్సంస్తూయమాన ప్రతాపవంతుఁడును ఖగపదంకావిర్భూతుఁడును నగు రఘురాముఁ డనుగొనియుట, ము క్తకంచుక మహోరగమును గాలం బ్రహరించుట యగును. నిష్కారణవైరమున కొడిగట్టి చెడనేల? ఇదిగాక,

చం॥ రణమునఁ గాలుద్రవ్వుచుఁ, బరాక్రమలీలల నుక్కుతున్కలై,
యనితరసాధ్యులై, రిపుభయంకరులై, సహజప్రతాప సం
జనిత మహాయశోవిభవ సంవృత సర్వదిగంతరాళులై,
వినుతికి నెక్కువారు పది వేలకుఁ గోట్లకు నుందు రచ్చటన్॥

ఆ రఘురామునకును నీకును హస్తిమశకాంతరముగలదు. నదుమంత్రిపు బల్కి నమ్మకొని యుత్తమక్షత్రియవీరులతోఁ బగ దెచ్చుకోఁదగునా? ఇది నీ వినాశమునకు హేతువు. దేవేంద్రాదుల జేమరించు యోట్ల విజయగుసందిలితని విఱవీగఁ దగదు. "అత్యుచ్ఛ్రయః పతనహేతుః" అని యార్యవచనము కలదు. ఇష్టదైన సీత నొసంగి రాములపాదములంటి శరణువేఁడఁ బొమ్ము. కాదేని రణభేరీనినదంబులు బ్రహ్మాండ గర్భనిర్భేదకంబులుగా, సుగ్రీవాంగద జాంబవద్గవయ నీల సుషేణ ప్రముఖ మహాయోధాగ్రేసర పురస్సరముగ, లంకాదుర్గము జుట్టుముట్టికొన్నపుడు బ్రతికిపో బ్రహ్మాదులకైన నశక్యంబన నీవెంత? ఊరక రామునితోఁ జెల్మియొనర్చి నీరాజ్యంబు నిలిపికొనుము. వెండియు,

చ॥ మునుకొని స్వాశ్రితావనస మో "నహిధర్మ" యటన్న వాక్యముల్
మనమున నెన్నఁడే మఱని మాన్యుఁ డతం డటుగావునన్ జగ
జ్జననిని సీతనున్ బృథుల సంపదయున్ గొని వేఁడబొమ్మ తం
డైన నెడుఁ కూర్మి నేలు నిపు డేనియుఁ గార్యము మించకుండఁగన్॥

రావ—(సోత్ప్రాసముగ) రామునితోఁ జెల్మియొనర్చని కతమునను సర్వశక్తి ప్రతిష్ఠలు కొఱవడియుండెఁగాఁబోలు: నిక్కము వచించితివి.

తే॥ గీ॥ అలఁతి కుందేళ్ళతోఁ జెల్మి నలుపకున్నఁ
బ్రిథిత శార్దూలములు భువి బ్రతుకఁగలవె?

హీనమానవుతోఁ ♦ జెల్మి నూనకున్న
దనుజసమ యిఁక మీఁద ♦ మనఁగఁగలదె?

తిమిరముతోడి నేస్తము ప్రభాకరునకెంత యవసరమో మీతోఁ జెల్మియు మాకంత యవసరము.

విభీ—(స్వగతము) అయ్యో! ఇంతవఱ కీదూతముఖమున వెలువడిన సముచితాంశము లెవ్వియు మాయన్న చెవి కెక్కక చెవిటికి శంఖూదినట్లయినవి. ఎట్లెక్కును?

తే॥ గీ॥ ఖలునకు హితోపదేశంబు ♦ సలిపినంత
మూర్ఖ మంతంతకును వృద్ధిఁ ♦ బొందుఁజూవె!
పన్నగమునకుఁ గూర్మిమైఁ ♦ బాలువోయ
మించుఁగాని విషంబు శ ♦ మించునెట్లు?

'లోటుపిటుకూల రోకండ్లంగాని పోవ' దన్నట్లు రాముని నిశితబాణ పరంపరఁగాక వేఱెవ్వియు నితనిని జక్కదిద్ద నేరవు. (ప్రకాశముగ) అన్నా! ఈరాయబారి నిష్పక్షపాతముగ మాటలాడుచున్నాఁడు. రాముఁడు సామాన్య రాజమాత్రుఁడు కాఁడు. లోకానుగ్రహార్థమై యవతరించిన దివ్యపురుషుఁడు. అట్టి మాన్యునితో నిష్కారణ కలహమునకుఁ గాలు ద్రవ్వనేల? సంధి చేసిన మన మెప్పటియట్ల సుఖింపఁగలము.

ప్రహ—విభీషణా! అతఁడేమో దివ్యపురుషుఁడనియు, సంధిచేసి మైత్రి సంపాదింపఁదగుననియుఁ, బల్కుచుంటివి; కాని యంతటి తేజశ్శాలితో మైత్రి సల్పనున్న మాకిఁక బ్రతుకెక్కడిది? ఒరుఁడు తనయాలినిఁ బరిగ్రహించినను మూకీభావము వహించునంతటి శూరాగ్రేసరుఁడును, జనావాసపదము లభింపక కాననసీమలఁ గందమూల భక్షణము సేయుచు దిన మొక యేఁడుగఁ గడపునంతటి మహాభోగియు నగువానితోఁ జెల్మి సేయనిది గొప్ప పొరపాటేయగు. (సోత్ప్రాసముగ) ఆహా! అతని పంచతోఁ గూడ నిది గొప్ప లోపమనుటకు నీకు నోరెట్లు వచ్చెనది?

అంజ—(సరోషముగ) ఓరీ యున్మత్తహృదయా! విద్విషద్ద్విపేంద్ర కుంభ విభంజన లాలసశీలంబగు మనుజసింహకిశోరంబు, కొండొక కారణంబున శృంఖలా నిగళితమై యుండు సమయమున నీ గోష్ఠులాడుచుంటివి గాని తదీయ బంధ విముక్తంబున భయవికలత్వంబగు దానవరాజసత్వంబు మఱుంగుజొచ్చినను, ఖద్యోత ప్రద్యోతంబు గాఢాంధకారం బెట్లు సమయం జేసెడు? కొండొక శాంతము వహింపుము.

విభీ—భళిరా! ఇతని యనివార్యక్రోధమును భీషణాకారమును జూడ, రాక్షససైన్యంబున నెవ్వరితని నడ్డుకొనువా రున్నట్లు కాన్పింపదు.

రావ—ఓరీ! సభాంగణముచేరి చెలరేగిన మత్తగజంబుపగిది, మాటిమాటికి నోటికి వచ్చినట్లెల్ల వాగుచుంటివి. శౌర్యనిధులగు దానవులమధ్యనుండుటను జ్ఞాపకమున నుంచుకొనుము. దుర్నిరీక్ష్యమాన ప్రతాపుఁడును, లోకభీకరుఁడు నగు రావణు సభ యిదియని తలఁపునకుఁ దెచ్చుకొనుము.

ఆంజ—దానవులమధ్యనే కాదు; దానవాధినేతయైన రావణుశిరముపయి రెండింత లగ్రభాగమునఁ గూర్చుంటిననికూడ జ్ఞాపకమున్నది. మఱియు, మీరు లోకనృశంసు లగు రక్కసులనుటయు మఱపురాలేదు. తాటాకుచప్పుళ్ళకేల తోడేళ్లు బెదరును? సమయ నిర్వహణమునకై శాంతము వహింపవలసె కాని— లేకున్న, నీ యాయు వింతపాడుగయి యుండదు. నీ దుష్టాలాపములకుఁ దగినప్రతిఫలం బిప్పుడ యనుభవించియుందువు; కానిమ్ము ప్రచండ కోదండ కరమండితుఁడై రామభూమీశుఁడు రణావని నిల్చి యనుజ్ఞనొసఁగినపుడైన, మా కన్నులపండువు గాకుండునా ?

రావ—ఓరీ! కొండగుహల జంతుసంతతులవలె సంచరించుచున్న యడవి మనుష్యులను నుందలుగూర్చుకొన్న యొక మానవాధముఁడు, రాజనీతియందును రణశిక్షా విధానమునను బాగదాగన్న రక్షస్సమూహముల నిర్జింపఁ గల్గునను టెంతటి బుద్ధిహైన్యత్వము ?

ఆంజ—అయ్యో! మృత్యువు సన్నిహితమై నిన్నిట్లు పలికించెడుఁగాఁబోలు? భృత్యామాత్య సమేతముగఁ బొలియనున్న నీవిధముంజూచి జాలినొంది పలికెద. ఇది స్మరణకుఁ దెచ్చికొమ్ము. అలనాఁడు నిన్ను సప్తసముద్రములముంచి తేల్చి, గర్వభంగముఁగావించి దయదలంచి విడిచిపెట్టిన వాలిని, నొక్క కోలనె సంహరించె. రాజన్యలోకమునకు మోపెట్టనైన శక్యముగాని మహేశ్వరచాపము నవలీలవిఱిచె. ఇంక నిట్టివెన్నియో మనుష్యదుస్సాధ్యములగు కార్యముల నొనర్చె. ధర్మసంస్థాపనార్థమై జన్మించె. ఇట్టి యమ్మహానీయు నలఁతిగాఁ దలఁచితివి. మఱియు,

తే॥ గీ॥ బలయుతులైన ప్రకట ప్రభావులైన
దుష్టులనుగూల్ప నతనికిఁ గష్టమగునె ?
రూపసంపదఁ దనకంటె నేపుమీఱు
సింధురముగూల్పఁ గేసరి చిక్కువడునె?

ఇంతయేల? ఇదే మానిశ్చయము వినుము.

ఉ॥ అక్కటికంబుమాని, విభుఁ డాహవభూమిని నిల్చి, సేసపైఁ
జక్కని చూడ్కినింపిన, వి శాలహిరణ్మయ సౌధరాజముల్
దక్కునె? పుత్రులుం హితులు భారుణ్యబుంగ ర వేయునేటికిఁ?
సుక్కిన భీతి, భూబిలముఁ జొచ్చిన నిన్నును బోవనిత్తుమే?

కావున నిన్ను నిర్జించుట మాకుఁ దృణప్రాయమని నమ్ముము.

రావ—ఔరా! వీని కండకావరము? మేము శాంతము వహించుకొలంది వీఁడు వాడిమగం డయి కాఱులు ప్రేలుచున్నాఁడు. వీని నిక సహింపఁదగదు. ఓరీ! భటులారా! ధర్మాధర్మములం బాటింపక వీనిఁ గొనిపోయి శిరచ్ఛేదముఁ జేసిరండు.

విభీ—(స్వగతము) అకటా! చెడుకాలము దాపరించినపుడు పథ్యము సైత మపథ్యముగఁ దోఁచును గాఁబోలు? ఈ మహానీయుని హితబోధ మాయన్నకు వెగటుఁ గల్గించుచున్నది. ఎట్లన?

తే॥ జారిణికి భర్త పగయైన ♦ చందముగను
జోరు లిందుని వైరిగాఁ ♦ జూచుపగిదిఁ
దద్దయు హితోపదేశంబు ♦ తవిలి సేయు
నితఁడు ప్రతిపక్షుఁడయితోఁచెఁ ♦ బతికి నిపుడు॥

ఎట్లయిన నిపుడు కార్యము మించిపోనున్నది. దానవులందఱియశోధనున కే యెగ్గొనరింతురో కదా! అట్లు జరుగకుండఁ బ్రయత్నించెదఁ గాక. (ప్రకాశముగ) అన్నా! శాంతింపుము. ఏ సహాయము లేక ప్రభుశాసనమున లంకకేతెంచిన యొక రాయబారినిఁ జంపి, పాపము నొడిగట్టనేల? ఇదిగాక?

చం॥ అలయుక రాయబారమున ♦ కై చనుదెంచిన దూత నిమ్మెయిన్
బొలియఁగఁ జేయుటెంత? ప్రవు ♦ బోణుల, దూతలఁ బూని చంపఁగా
వలవదు శౌర్యవంతుఁడగు ♦ వానికి; సైరణసేసి నిల్పుమీ!
కులము యశంబు రాజ్యమును ♦ గోల్పడనేటికి ధర్మఘాతివై?

ప్రాణసమానయైన తనకాంతను గొనితెచ్చుటచేత రామునకుఁ గలిగిన దుఃఖభారమును జూడఁజాలక, రాయబారి పలికిన పలుకులకై యతనిఁ జంపించుటచే, మనకు లోకాపవాదము సంప్రాప్తిగలుగును. ఇతని నొప్పింపక విడిచిపుచ్చుఁడు.

రావ—విభీషణా! నీ విప్పుడు మాకడ్డువాట్లు వేయకుము. రక్షోరాజ్యమున కింతటి యపకారము సల్పిన వీనిఁ క్షమింపుమని నీ వెట్లనుచుంటివి?

విభీ—కావుననే మన కిన్ని యుపకారములు సల్పిన యితని నొక్కసారి ప్రాణములం దీయక సహింపరాని వేదనలం బెట్టి పోవిడుచుట యుక్తమని విన్నవించితిని.

రావ—తమ్ముఁడా! పొరపడితివి. శత్రుశేషము మున్ముందుకుఁ గారణమనుమాట మఱచితివా? మఱియు లంకారాజ్య విప్లవకారుఁడగు నితనిఁ బ్రాణములతో విడిచిపుచ్చిన రాజ్యవిచ్ఛిత్తి కది కారణము కాఁగలదు.

విభీ—అన్నా! ఈదూతనొక్కని వధించినంతనే విప్లవము శాంతింపనేరదు. విశేషించి యందు మూలమున ననర్థమే కలుగఁగలదు. రాయబారియై వచ్చినవానిని జంపుటచేఁ గీర్తిప్రతిష్ఠలునశించును. ఏమాతను మోహన స్వరూపిణిగ భావించి తెచ్చితివో యామె లంకా వినాశకారిణియగు కాళరాత్రియని యెఱుంగవు. అమ్మహాసాధ్వియే—యానిరంతర శోకాగ్నియే—లంకాతేజమును బూదిచేసినది. ఇఁక నీ దుష్కార్యమును గూడఁ జేయనేల? ఇదియుఁగాక యీ దూతయందే తప్పిదమునులేదు. ఎట్లందువేని సందేశమును గొనితెచ్చి యొరులు పుత్తెంచినరీతి ననుసరింపఁగాని వేఱొండుగాదు; మఱియు,

తే॥ గీ॥ ఇలఁ బరాధీనవర్తనుం ♦ డితనిచేతఁ
బ్రభువునాజ్ఞ నిర్వర్తింపఁ ♦ బడియె నిందు
భృత్యధర్మంబునల్పమి ♦ కృత్యమగునె?
వలవ దీతనిఁ జంప; దుః♦ష్ఫలముగలుగు.

కావున నీతని సహింపరాని వేదనలకుం బాల్పఱచి పోవిడుచుటయే యిప్పటి కర్తవ్యము.

రావ—విభీషణా! పిచ్చుకపయి బ్రహ్మాస్త్రమనునట్లు వీనిని సాధించి మాత్ర మేమేలు నందఁగలము? నీచెప్పినట్లె యొనర్చెద. ఓరీభటులారా! మీ రీ దూతనామ విప్లవకారుం గొనిచని, యితని కరమునకుఁ బ్రాఁతవస్త్రములు చుట్టి, తైలమున మెదిపి యగ్నిని రగుల్కొల్పి, వీథివీథులఁద్రిప్పిన యనంతరము, పట్టణమున కావలఁ ద్రోసి రండు.

విభీ—(స్వగతము) ఈమూలమున మాయన్న మూలనాశనమునకుఁ దెరు వన్వేషించుకొనుచున్నవాఁడు.

(అప్పుడు రాక్షసవీరులట్లొనర్తురు).

ఆంజ—(స్వగతము) మాయురే! రామాజ్ఞలేక యెట్టి కార్యముఁ జేయుటకైనను వెనుదీయుచున్న నన్ను వీరే ప్రేరేపించుచున్నారు. ఓ సర్వహృదయాంతరాళపరిశీలకా! భగవంతా! నీవిప్పుడు సాక్షి కావలసివచ్చినది. ఏలయన?

తే॥ గీ॥ అసురలు కుపితాత్ములై నిడిన యీ ♦ యనలుఁడిపు
చెలఁగి లంకాదహనము ర ♦ చించుఁగాక
శాతఖడ్గముఁ దన కేలఁ ♦ జఱచిచెఱదు
జడుని విధమున నిందఱు ♦ నడలుచుండ.

(జ్వాలల చేతఁబట్టి).

హే! దయామయా! జగత్ప్రభూ! నియమోల్లంఘన మనెడు పాపము నన్నుఁ బొందఁకుండ కాపాడుము.

(ధ్యాననిమీలిత లోచనుఁడై).

ద్విపద. సకలలోకాతీత ♦ సర్వనిర్ణేత !
ప్రకటనారక మేఘ ♦ పవన విఖ్యాత !
నిరతకృపాపూర ♦ నిగమ సంచార
శరణు దీనాధార ♦ జగ దేకవీర !
మౌనిమానస భాస ♦ మాన విహార !
జ్ఞానపరిదాన యో ♦ సర్వనిదాన !
చరణ సేవకుఁడఁ బరి ♦ జ్ఞా విహీనుండఁ
గరుణింపుమిందు జ ♦ గత్కారణుండ!

హే ప్రకాశస్వరూపా! జగదుద్భవస్థితి ప్రళయకారణ పరిచండశాసనా ! జగత్కర్తా! సర్వాంతర్యామివగు నో పరమాత్మా !
........రక్షింపుము..........రక్షింపుము..........

(అనుచు నగ్నినంతట వెలిఁగించి పురదహనమునకుఁ బూనుచు)

హే! భువనప్రదీపా! దుర్మద విపక్ష శిక్షాదక్షా! జాజ్వల్యమానకీలాకరాళ విద్యుజ్జ్వాలాతిరేకంబుగ లంకానగరంబు నేకజ్వాలా సమాకీర్ణంబుఁ గావింతుఁ గాక.
(నిష్క్రమించును.)

(లోపల)

సీ॥ పరదారహార మహా ♦ పాతకాటవిఁగాల్చు
ఘోర దావానల ♦ గుణగణంబు
మద్యపానాది దు ♦ ర్మదవస్తుసేవక
రౌద్రప్రతాప జా ♦ గ్రన్మహాగ్ని
పిశితాశనాసుర ♦ భీకర భీభత్స
కృత్స్నమహా ప్రకారద్ర ♦ కృష్ణవర్త్మ
పరధనాపహరణ దు ♦ ష్పాతక సర్వతో
ముఖవైద్యుతాగ్ని స♦ముద్భవంబు

వీరవిలాసము

తే॥ గీ॥ అసుర రాక్షసమూల సం ♦ హారణ చణము
రామబాణాగ్ని రావణా ♦ గ్రహవినాశ
కరము, వీరాంజనేయ వి ♦ గ్రహము శిష్ట
రక్షణాకరమై, యుగ్ర ♦ దీక్షఁబూనె॥

చతుర్థాంకము.

సమాప్తము.

---



PRINTED AT THE ANDHRA GRANDHALAYA PRESS, BEZWADA.
PUBLISHED BY PANDIT SEERIPI ANJANEYULU,
PROPRIETOR, VIGNANA VALLIKA, DHARMAVARAM.
30th NOVEMBER 1921.